శ్రీ

# గయోపాఖ్యానము.

బ్ర॥ చిలకమర్తి లక్ష్మీనరసింహాఖ్యు

రచియింపఁబడినది.

(మూడవ సహస్రము ముద్రిత ప్రతులు)



ఇప్పటికి ముద్రితము 4000 ప్రతులు.

మాదేటి సన్యాసయ్యా అండ్ సన్సు వారి సమ్మతిని

పబ్లిషరు,

కురుకూరి సుబ్బారావు.

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ, కృష్ణాజిల్లా.

కాకినాడ · స్కేప్ అండ్ కో., లో ఇ.సుబ్బారాయుడుబ్రదర్సువారిచే ముద్రితము.

 1928. [వెల రు 0-8-0.

# ఆంధ్ర నాటకములు.

| | రు. | అ. |
|---|---|---|
| ఊర్వశీశాపవిమోచనము అ॥ సు॥ | 1 | 0 |
| జయచంద్రచంద్రరేఖావిజయము | 0 | 10 |
| వసకాబకావళి | 1 | 0 |
| గులేబకావళి | 1 | 0 |
| శ్రీకృష్ణవిలాసము | [illegible] | 12 |
| గర్వభంగము | [illegible] | 10 |
| శ్రీరామాంజనేయము పి॥ చి॥ | 1 | 0 |
| సంపూర్ణభాగవతము శే॥ రా॥ | 0 | 12 |
| శ్రీకృష్ణదేవరాయవిజయము | 0 | 12 |
| ఫాలాఫ్ విజయనగర్ | 0 | 12 |
| విజయభాస్కరము జ॥ ల॥ | 1 | 0 |
| ప్రభాకర డిటో | 0 | 8 |
| శారదావిజయం కో॥ స॥ | 0 | 12 |
| చంద్రకాంత డిటో | [illegible] | 12 |
| మహానంద డిటో | [illegible] | 12 |
| కబీర్ దాసీయము శ॥ వే॥ | [illegible] | 12 |
| రాధాకృష్ణలీల కం॥ రా॥ | [illegible] | 12 |
| స్త్రీసాహసము వెం॥ వెం॥ | [illegible] | 10 |
| సత్యహరిశ్చంద్ర శా॥ వీ॥ | [illegible] | 12 |
| సంగీతసావిత్రి చ॥ మా॥ | 1 | 0 |
| సత్యహరిశ్చంద్ర డిటో | 1 | 0 |
| సంగీత ప్రహ్లాద డిటో | 0 | 12 |
| సంగీత స్త్రీసాహసము | 0 | 12 |
| పద్మవ్యూహము | 1 | 0 |
| కృష్ణరాయబారము | 0 | 12 |
| చిత్రనళీయము | 1 | 4 |
| స్వగ్ధవివాహము | 0 | 12 |
| రాధాకృష్ణ డిటో | 1 | 0 |
| నరవిక్రయము డిటో | 1 | 0 |
| భక్తతుకారాము శ్యా॥ పం॥ | 1 | 0 |

| | రు. | అ |
|---|---|---|
| కుశలవ నాటకం వి॥ సు॥ | 0 | 12 |
| శారంగధర డిటో | 0 | 12 |
| సంపూర్ణోత్తరరామాయణము రా॥ శా॥ | 1 | 2 |
| సుమతీదేవి బ॥ శో॥ | 0 | 12 |
| హనుమద్రామసంగ్రామము | 0 | 12 |
| లక్ష్మణమూర్ఛ సో॥ రా॥ | 0 | 12 |
| శకుంతల డిటో | 0 | 12 |
| దానవీరకర్ణ డిటో | 1 | 0 |
| సంగీత గులేబకావళి చ॥ మా॥ | 1 | 8 |
| పాండవాజ్ఞాతవాసము దో॥ సీ॥ | 0 | 0 |
| చతురచంద్రహాస డిటో | 0 | 8 |
| పీష్వా నారాయణరావు | 0 | 1' |
| తాజ్ మహాల్ సో॥ రా॥ | 1 | 0 |
| శ్రీరామజననము దో॥ సీ॥ | 0 | 8 |
| శ్రీరామ ప్రవాసము | 0 | 8 |
| శ్రీరామోద్యోగము | 0 | 8 |
| శ్రీరామ విజయము | 0 | 8 |
| శ్రీరామాశ్వమేధము | [illegible] | 8 |
| వైదర్భీవిలాసము | 0 | 12 |
| ఆంధ్ర పతాకము | 0 | 12 |
| ప్రతాపరుద్రీయము సో॥ రా॥ | 1 | 4 |
| రుక్మిణీ పరిణయం గం॥ శే॥ | 1 | 0 |
| సీతాకళ్యాణము బ॥ సీ॥ | [illegible] | 8 |
| సంగీత కృష్ణలీల చ॥ మా॥ | 1 | 0 |
| చిత్రనళీయము దా॥ స॥ | 1 | 4 |
| తపతీ సంవరణము శా॥ కొం॥ | 0 | 12 |
| సువర్ణపాత్ర ర॥ జా॥ | 1 | 0 |
| సుగ్రీవ పట్టాభిషేకం సో॥ రా॥ | 0 | 12 |
| సీతాకళ్యాణము డిటో | 0 | 1 |
| శ్రీరామ జననము డిటో | 0 | 1 |

వలయువారు— సరస్వతీబుక్ డిపో,

# గయోపాఖ్యానము

ఇది

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిచే

రచియింపఁబడినది,

మాదేటి సన్యాసయ్య అండ్ సన్సు వారిసమ్మతిని,

పబ్లిషరు,

కురుకూరి సుబ్బారావు

సరస్వతీ బుక్ డిపో,

బెజవాడ, కృష్ణాజిల్లా.

(నూతనపద్యములు చేర్చిన క్రొత్తకూర్పు)

మూఁడవ ముద్రణము 4000 ప్రతులు.

కాకినాడ.

క. సుబ్బారాయసోదరులచే స్కేప్ అండ్ కో., లో ముద్రింపఁబడియె.

1928.



[దీని వెల 8 అణాలు.

## ఈనాటకమునందు వచ్చుపాత్రములు.



### పురుషులు.

శ్రీకృష్ణుఁడు—కథానాయకుఁడు.

బలరాముఁడు—శ్రీకృష్ణునియన్న.

సాత్యకి—కృష్ణుని పినతండ్రికొడుకు.

కాశికుఁడు—కృష్ణుని వేడుక చెలికాఁడు.

గయుఁడు—గంధర్వరాజు.

బ్రహ్మ—

శంకరుఁడు—

నారదుఁడు—

యుధిష్ఠిరుఁడు, భీముఁడు, అర్జునుఁడు, నకులుఁడు, సహదేవుఁడు, పంచపాండవులు.

అక్రూరుఁడు—కృష్ణునిరాయబారి.

నందకుఁడు—వృద్ధకంచుకి.

అభిమన్యుఁడు—అర్జునుని కుమారుఁడు.

దుర్యోధనుఁడు—కౌరవేశ్వరుఁడు

కర్ణుఁడు—అంగరాజు.

భటుఁడు—

### స్త్రీలు.

రుక్మిణి—కృష్ణుని పట్టమహిషి.

సత్యభామ—కృష్ణుని రెండవభార్య.

చిత్రరేఖ—గయునిభార్య.

సుభద్ర—అర్జునునిభార్య, కృష్ణుని చెల్లెలు.

దేవకీదేవి—కృష్ణునితల్లి.

హంసపదిక—రుక్మిణిచెలికత్తె.

ఈగుర్తుగల పద్యములు నూతనముగ రచియింపబడినవి.



# గయోపాఖ్యానము.



నాంది

చ. అణువునయందు శీతగిరి ♦ యంతరమందున నాత్మమైనవా
కణమునయందు వారినిధి ♦ గర్భమునం జలిచీమయందు భీ
షణగజరాజమందు నొక ♦ చందమున న్వసియించు సర్వకా
రణమూలకారణం బయిన ♦ బ్రహ్మము మిమ్మునయమ్ము నోముతన్.

మఱియు,

గీ. పురుషుఁడ కళాంతసంప్రైన ♦ భూషణంబు । వరయశస్స్యందనమునకు సో ♦ పానపఙ్క్తి
ప్రాంశుకీర్తులకును వ ♦ జ్రాంగిజోడు । నైనకరణాగతశ్రీల ♦ మతిశయిల్లు.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి పుష్పాంజలిఁజల్లి)

పూజ్యులయిన రోసభాసదులారా! యీనాటకమును రచియించిన కవియే మీతో నిట్లు విజ్ఞాపనము సేయుమనుచున్నాఁడు

మ. వసుధన్ బుట్టినవారిలో నొకఁడు స ♦ ర్వజ్ఞుండు లేఁడెందు మా
నిని భావించిన కార్యమెట్టిదయిన ♦ న్నిర్దుష్టమౌ నంట వి
శ్వసనీయం బగుమాట కాదు; కృతులో ♦ ప్రాగస్త్యమాం గాంచినన్
రసమాం జిమ్మఁగఁ జారుషేణుమూలె గా ♦ నన్దోవ భూయిష్ఠముల్.

గీ. నిండుదివ్వెలనొడఁగ్రి ♦ నీడలట్లు । లలరు గురువెందవూసల ♦ నలువులట్లు
గుణగణముతోడదోస కుల్ ♦ గూడియుండు। బ్రాజ్ఞులంతఁ మింతురితరులు ♦ పరిహసింత్రు

(అని తెరవంకఁజూచి) ఓసీ! ఈమహాజనులం మనయాలస్యమునకు వినుగుకొందురేమో యని భయంపడుచున్నవాఁడ, కావున నీసింగారమిప్పటికిఁజాలించి యొకసారియిటురా!

(నటి ప్రవేశించుచున్నది,)

నటి—ఆర్యపుత్రా! అలంకారచుయినను ముగియకుండ నన్నింత వేగముగా రమ్మని మీరు సెలవిచ్చుటకుఁ గారణమేమి?

సూత్ర—సుందరీ!

గీ రాణ్మహేంద్రపట్టణమందు ♦ రసికవరుల । కరుణ గాంచుకపాత్రుఁడఁ ♦ గన్నవాఁడు
చిలకమర్తిలక్ష్మీనర ♦ సింహ మనఁగ । నున్నవాఁడు కవితఁ జెప్ప ♦ విన్నవాఁడు.

అతఁడు ప్రచండయాదవ మనుపేర గయోపాఖ్యానమును నాటకరూపముగ రచియించె. దానిని మనసామాజికు లీరాత్రి యీభవనంబునఁ బ్రయోగింపఁదలచు

కొన్నారు. దానికిం దగుయత్నము నీవొనరించి యీసభాసదుల హృదయములు రంజింపఁ జేయవలయునని కోరుచున్నాఁడ.

నటి—అటులయిన సర్వము సిద్ధమయియున్నది. ఇఁక మీమనమున నే సందేహము లేదుగదా?

సూత్రి—సుందరీ! చూడుము.

మ. రసికాగ్రేసరు లీసభాసదులు సా ♦ రగ్రాహులే గ్రంథక
ర్త సమర్థుండని చెప్పుచుండ్రితివృ ♦ త్తం బారయన్ బూజ్యులౌ
వసుదేవాత్మజ పాండునందనుల సం ♦ వాదంబె యౌఁగాని నా
యసమర్థత్వము గెల్పుచున్నయది నా ♦ కత్యంతసందేహమున్.

నటి—అయ్యా! వినయగర్భితములైనమీపలుకులు మీసౌజన్యమును వెల్లడించుచున్నవి. కాని, నాటకప్రయోగములం దపమానులని పలుమారు వినుతిగాంచిన మీకుసందేహింపవలసినపని లేదు. కావునమన మిప్పుడు సంగీతపురస్సరముగా నాటకమారంభింపవలసియున్నది. అందుచేత నే నేఋతువునుగూర్చి గానము చేయవలసియున్నదో సెలవిండు.

సూత్రి—

గీ. కోర్కెలేనివారికిఁగోర్కె ♦ గొలుపునట్టి। మోడుమ్రాఁకులేనియుం గ్రొత్త ♦ మొలకలెత్తు
నేఋతువు నీయమందు నా ♦ ఋతువుఁగూర్చి। గానమొనరింపుకలకంఠి ♦ కంఠమెత్తి.

నటి—అట్లయిన రతిరాజసహాయకారిఁ దానలంబై, ఋతురాజం బని పేరువడసిన వసంతమును గూర్చియే పాడెదను

కవిరాజవిరాజితము. నవనవమంజులకిసలయపుంజము ♦ నానాపురత్నవిభూషలుగాఁ
బ్రవిమలపుష్పపరాగవికాసము ♦ భాసురచందనచర్చలుగా
పావనకుందలతానటియాడెడు ♦ నావ్రిమదావనరంగములన్
భువన మెలర్పఁగ దక్షిణమారుత ♦ పోతము పేరిటి సూత్రివిసన్,

సూత్రి—ఆహాహా! నీగానము నీమూర్తియట్లే కడుంగడు మనోహరంబైయున్నది. అనుదినంబును నీమృదుమధురగానంబును వినుచున్న నేనేయానందమునకో లాడనింకఁ గ్రొత్తగా వినినయీసభాసదుల యుల్లములుల్లసిల్లెనని వేఱె చెప్పనక్కఱలేదు.

గీ. నాట్యకేళిఁ గోపికలు గెలు ♦ చాటునుండి। చూచుచున్నారు మనవంక ♦ నుదతి రమ్ము
మేను కృష్ణవేషము ధరి ♦ యింపవలయు। నీవు రుక్మిణీదేవివై ♦ రావలయును.

నటి—చిత్తము. (ఇద్దఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రస్తావన.



శ్రీ

ప్రచండయాదవనాటకము.

అను

# గయోపాఖ్యానము.

## ప్రథమాంకము.

రంగము—యమునాతీరమందలి బృందావనము.

(అర్జునుడు సాత్యకి ప్రవేశించుచున్నాఁడు.)

సాత్య—(తనలో) పూజ్యుఁడగు శ్రీకృష్ణుఁడు నిన్నసాయంకాలమున నన్నుం జేరఁ బిలిచి "వత్సా సాత్యకీ! రే పుదయమున మనము కాళిందీజలంబుల భానుఁడగు ప్రభాకరున కర్ఘ్య మొసఁగి యనంతరము జలక్రీడామహోత్సవమనుభవింపవలయు. కావున నీవు నేఁటిరేయి నాలవజామున మేలుకాంచి బలభద్రాదుల మేల్కొలిపి, వలయు సన్నాహము చేయుమనది." యని సెలవిచ్చె. ఆమహాత్ముని యాజ్ఞాబలమే నన్ను యథాకాలప్రబోధితునిఁ జేసినది. ఇఁక నాలుగుగడియలలోఁ దెల్లవారఁగలదు.

తే. గీ. వసుమతీదేవి భర్తయౌ • భానుదేవు । దర్శనము చేయ లజ్జించి • తాల్చినట్టి
తెల్లపట్టుమేల్ముసుఁగట్లు • తేజరిల్లు । నీయుషఃకాలచంద్రిక • యింపు లలర

కువలయానందసంధాయకుఁడును, మాకు సంరక్షకర్తయునగు నీశీతమయూఖుఁడు మన్మదంబు విడిచి యస్తమింపవలసివచ్చెం గదా యని ఖిన్నుఁడయినవాఁడుంబోలె మొగము వెలవెలఁబాఱ గ్రమంబున నస్తగిరిం బ్రాపించుచున్నవాఁడు. అదిగో! త్రిలోకపూజ్యుండగు దేవకీతనయుని మేల్కొల్పుటకై మంగళతూర్యనాదము లివ్వడే ప్రారంభమగుచున్నవి.

తుష్టి యమునదినీవనంబున నుండదు. నిద్రిమాటయటుంచి ప్రస్తుతకార్యమునుం జూడుము. నీవు పోయి బలదేవాదుల మేల్కొల్పుము. నేను పూజ్యుండయిన శ్రీకృష్ణుండు మేలుకొనెనేమో చూచివచ్చెద.

కాశి—అయ్యా! అట్లే చేసెదను. కాని నాను దేవ్వుండీసమయమున సకళత్రముగ యమునాతీరమునకు వచ్చుటకుం గారణమేమి? ఈశంక నామనంబును బీడించుచున్నది. అతండు కేవలము జలక్రీడార్థము సకుటుంబముగ నింతద వ్వేటగుదెంచునా?

సాత్య—కారణమెఱుంగవా? చెప్పెదవినుము. శ్రీకృష్ణుండు బాల్యంబునం గొంతకాలము వ్రేపల్లెలో నందయశోదల పెంపుడుబిడ్డండై పెరిగెను. ఆయన నిప్పుడు చిన్నవాంటి తల్లిదండ్రులగు నందయశోదలం జూడంగోరి పిలువనంపెను. వృద్ధులగు గోపాలక గోపికలను సందర్శించుటకును, శైశవంబునందు క్రీడాస్థానమైన యమునలో సకుటుంబముగ జలక్రీడామహోత్సవము సలుపుటకును సంకల్పించి యదుకులం బిప్పుడీబృందావనమునకు విచ్చేసి యున్నాండు. ఇప్పుడే మేలుకాంచి, కాల్యకృత్యంబుల నిర్వర్తించి, ప్రాభాతికమందసమీరంబుల నించుక సేవించి, బ్రాహ్మణులకు విధివిధానముగ నర్ఘ్యప్రదానము చేసి. యనంతరము జలకేళి సవరించి, సాయంకాలమగునప్పటికి వ్రేపల్లెకుం జని, తల్లిదండ్రులదర్శనము చేసికొని, మూండునాళ్ళ నట నుండి పిమ్మట ద్వారకకుం బోవును.

కాశి—సరిసరి. తెలిసినది. ఎన్నండో పెంచిన ముసలిగొల్లలం జూచుటకా యీయన బయలుదేఱినది? పోనీ. ఎందుకైననేమిలే. మనకింక వ్రేపల్లెలోం గావలసినన్ని పాలు, కావలసినంత పెరుంగు కావలసినన్ని వేంకలు: ఇక్కడనుంచినల్ల మేకలేమైన దొరకినం దీసికొనిపోయి యజ్ఞము చేయుదును. (అని నిష్క్రమించుచున్నాండు)

సాత్య—సత్వరము బలదేవుని మేల్కొల్పెదను. నేను కృష్ణుని గుడాగమనకరిగెదను. (అని నిష్క్రమించుచున్నాండు.)

ఇదివిష్కంభము.

———

[అంతట శ్రీకృష్ణుండు ప్రవేశించుచున్నాండు]

కృష్ణ—(తనలో) ఏమి యీబృందావనరామణీయకము!

లయగ్రాహి — జంపెత

సుందరలతాకుసుమబృందములు జొంపములునందమయి కన్నులకు విందొసంగ గానిం
దిందిరములోలిమకరందములం గ్రోలియరవిందమృదుతల్పములయందు దవరంగా

నందకరుఁడౌచు నలమందమలయానిలుఁడు కందువులవీధి క్రీమలందరుమఁగాఁ హృ
న్మందిరమునసంతసమునొంద నెటులున్న దో పురందరమహోజ్జ్వలితనందనమువోలెన్॥

రుక్మిణీ సత్యభామాదులు మేలుకొంచిరో లేదో తెలిసికొనిరమ్మని పంపఁబడిన కాశికుఁ డింకను రాకున్న వాఁడేమి? (ముందుచూచి) అదిగో వచ్చుచున్నాఁడు.

కాశి—(ప్రవేశించి) వాసుదేవా! నేను ద్వారకనుండి యేదుర్వ్యవహారార్థము బయలుదేఱితినో గాని నాకన్నియుఁగవచులే కలుగుచున్నవి. నేనిప్పుడు దిక్కులేని వాఁడ నయితిని?

కృష్ణ—కాశికుఁడా! నీ కేమి యాపద సంభవించినది? నీ వేల దిక్కుమా నవాఁడ వయితివి?

కాశి—ఏమి యాపదయా? నీయంతఃపురపరిచారికల ముందఱ నేను బ్రదుకఁజాల కున్నాఁడను. అందఱికన్నఁ దొత్తుకూఁతురు హంసపదిక మఱిమఱిమిట్టిపడుచున్నది. తాను పట్టమహిషి యగు రుక్మిణీదేవి పరిచారిక యగుటచే గర్వితయై నక్తకుమీఁదికి బండికొల్లినట్లు నామీఁదికి మాటిమాటికిఁ జొరఁబాఱి వచ్చుచున్నది. ఎంత కేఁదుకవి నే నూరకొన్నాను గాని నాకుఁగోపమువచ్చిన నన్నెవ్వ రాపలేను.

కృష్ణ—మిత్రుఁడా! నిన్ను హంసపదిక యేమిచేసినదో చెప్పవేమి?

కాశి—ఏమి చేయవలయునో యదియే చేసినది. జగత్త్రయైకపూజ్యుఁడవైన నీకు వేడుకచెలికాఁడనై పవిత్రుఁడగు బ్రాహ్మణుఁడనై యున్నాను బ్రతికి యుంటికి నుకఁ బచ్చినన్నట్లు నేఁటికాలమునకు పగలాఁడియగుహంసపదికచేత గొప్పపరాభవమునుఁ బొందితినిగదా! (అని యేడ్చుచున్నాఁడు.)

కృష్ణ—మూఢుఁడా! జరిగిన వృత్తాంతము చెప్పక యూరక యాఁడుదానివలె వాపోయెదవేల?

కాశి—అవును: ఆడుదానిచేఁ బరాభవింపఁబడిన మగవాఁడు తప్పక యాఁడుదానివంటివాఁడే. నేనంతపాటుపడఁగా నీవనుటలో లోప మేమున్నది? నీభార్యలు నా కవమానము చేయించిన నీపరిచారికలు చేసిరి. నీవు నన్నోదార్చుటకు మాఱుగా మూఢుఁడా యనియు నాఁడుదానివలె వాపోవుచుంటివనియు నన్ను దూషింపఁదొడంగితివి. ఇంకను నాదినములు మంచివి కావు. ఏదో పరాభవము జరుగునని నేను మొదటనే యనుకొంటిని ఏలయన పనము బయలుదేఱువాఁడు నిద్ర మేల్కొని కన్నులు తెఱచిన తోడనే మాయపిల్లి నాకంటఁబడినది. వెంటనే విడుపకట్టితో దానిఁజావ

గొట్టి కాల్యకృత్యంబులఁదీర్చుకొని ప్రయాణమైవచ్చుచుండ ముందుగావితంతు వొకర్తు నాకెదురుగావచ్చినది. ఆమెను గొంతసేపుతిట్టి మరల వెనుకకుబోయి కాళ్లు కన్నులుం కడుగుకొని, కొంతసేపాగి రెండియు బయలుదేఱునప్పటికి నూనెకావడివాఁ డెదు రయ్యెను. మరల వెనుకకుఁబోయి జాముసేపాగి తిరిగి బయలుదేఱి శకునము చూడఁద లఁపక పరుగుపరుగునవచ్చి మిమ్ముం గలసికొంటిని, అదుశ్శకునఫల మనుభవింపక తప్పునా?

కృష్ణ—నీమాహాత్మ్యమునకు మేరలేకున్నది. నీకు జరిగిన బన్నము తెలిఁగింతువేని హాంసపదికను మందలించెదను. చెప్పు, చెప్పు.

కాశి—అట్లయినవినుము. రుక్మిణీదేవి పవ్వళించినగుడారమునందర నొకచిన్న మంచముమీద వెన్నెలలో హాంసపదిక పండుకొని గుఱ్ఱుపెట్టి నిద్రపోవుచుండ. గామీరు చెప్పినపనిమీఁద నేనక్కడకుఁబోయితిని. పోయి హాంసపదిక నెట్లుమేల్కొల్పుదు నని యించుకవిచారించి, చిన్నప్పుడుపగటివేషములలోఁ దిరిగి జంతువులకూఁతలు సరిగా గూయుట నేర్చుకొనిన విద్యావంతుఁడ నగుటచే, నామెమంచముక్రింద దూఱి కుక్క మొఱిఁగినట్లు మొఱుఁగ నారంభించితిని. ఆమెయు నదరిపడిలేచి, రెండుమూఁడు నిమిషములాలోచించి, మంచముక్రింద మొఱుఁగుచున్నది కుక్క కాదని నిజము గ్రహించి ప్రక్కనున్న బెత్తముఁబుచ్చుకొని నాకు నాలుగుదెబ్బలు తగులనిచ్చెను. అప్పుడు నేను "చీచీ, కుక్కనుకానే కొట్టకేకొట్టకే" యని మొఱుఁగుటమాని మొఱ్ఱపెట్టితిని. అప్పుడది "ఛీ! నీవు కుక్కవే, మాటలునేర్చిన కుక్కవుసుమీ" యని తనపనిమానక రట్టించెను. అంతట నేను దెబ్బలఁదినలేక, లేచి యావలకువచ్చి గోళ్లతో దానియొడలు బరికి పండ్లతో దానిచేతులఁ గఱచిఁ గాయాలు బ్రద్దలుగొట్టి ప్రాణములు దక్కించుకొని యీవలఁ బడితిని.

కృష్ణ—(నవ్వుచు) సరే; నీవు చేసిన హాస్యమునకును, నామె చేసిన ప్రతిక్రియకు సరిపోయినది. ఇందుభయులు సమానులే.

కాశి—సమానులా! ఎగతాళికి నేనుకుక్కనై మొఱుఁగుటయెతిఁగి నన్నిట్లామె చేయవచ్చునా?

కృష్ణ—ఎగతాళికి నీవు మొఱిఁగితివి ఎగతాళికే యామె నిన్ను మర్దించినది.

కాశి—మంచితగవు చెప్పితివిలే. నీతోజెప్పుట నాదేబుద్ధిపొరపాటు. భార్యా పరిచారికపక్షము చెప్పక నాపక్షమువలుకుదువా? అతివంకవారాత్మబంధువులన్న మాట యబద్ధమా? నాయదృష్టమున నీవక్కడలేవుగాని, యున్నయెడల మఱిపదిదెబ్బలు వడ్డింపుమని యామెతో గట్టిగఁ జెప్పియుందువు.

కృష్ణ—కౌశికుఁడా! నీ కణుగు లెవ్వియు నున్నవి. ఇంతకు స్త్రీజనము మేలు కొన్నదా లేదా?

కౌశి—ఎట్లు మేలుకొనక యుండును? నేను మొఱఁగిన మెఱుఁగులవినియానినంత రము నేను చేసిన కేకల నాలించియుఁ బిదప నేను హంసపదికతోఁ జేసిన ద్వంద్వ యుద్ధధ్వనుల నాలకించియు, నవరోధజనము, దాసదాసీజనము, కంచుకజనము కాటు కుక్కలు, చిలుకలు, గోరింకలు, నెమళ్ళు, వేయేల ప్రాణములుగల సమస్తజంతువులు మేలుకొనితీరినవి. ఎట్లో నీయాజ్ఞమాత్రము నెఱవేఱినది. సంకల్పసిద్ధుఁడవు.

కృష్ణ—(నవ్వుచు) ఇందు హంసపదిక నిజముగ నుపకారమే చేసినది. ఆమె నీ విధమున గారవింపకున్న స్త్రీజన మింతత్వరలో మేలుకొనదుగదా!

కౌశి—సరే. నీవామెను మెచ్చుకొనుచుందువు, నేనిప్పుడో దానికిఁ దగిన ప్రాయశ్చిత్తముఁ జేసెదను. ఈపరాభవము నాగుండెలలో యావజ్జీవము మెలఁగుచునే యుండును.

కృష్ణ—వయస్యా! మనమవరోధజనముకడకుఁ బోయి జలక్రీడ కుచితమైన వస్త్రాలంకారముల ధరించి సిద్ధముగ నుండుఁడని చెప్పెదము రమ్ము.

కౌశి—వచ్చెదనుకాని గయ్యాళిగంప హంసపదికతో మరల నాకేమి జగడము వచ్చునోయని భయముగానున్నది. అది సన్నమయిన వనితకాదు. అన్నచో నాకుఁ గోపముగాదు. నేనలిగిన నన్ను హరిహరాదులాఁపలేరనుమాట నీవెఱింగినదేకదా!

కృష్ణ—(నవ్వుచు) నీశౌర్యము నేనెఱుఁగనా? వేఱే నీవు చెప్పవలయునా? నేను దగ్గఱనే యుండు గాన భయములేదు. రమ్ము. (అని నడుచుచున్నారు.)

(అప్పుడు రుక్మిణియు, హంసపదికయుఁ బ్రవేశించుచున్నారు.)

రుక్మి—హంసపదికా! సత్యభామ, మిత్రవింద, జాంబవతి మున్నగు కాంతలు మేలుకాంచిరేమో యెఱుఁగుదువా?

హంస—అమ్మా! అందఱు మేలుకాంచిరి. అదిగో సత్యభామ నీతోఁగలసి హృదయేశ్వరు దర్శనముసేయ నిటే వచ్చుచున్నది.

రుక్మి—ఏది యేది సత్యభామ?

[అప్పుడు సత్యభామ ప్రవేశించుచున్నది]

సత్య—అక్కా! ఈయుషఃకాలమున మనకౌశికుని కేకలే మనకు మేలుకొలుపులయ్యెను.

రుక్మి—హంసపదిక మనలను మేలుకొలుపుటకు బద్ధకించి యీవిధముగఁ గౌశికునిచేఁ బ్రబోధింపఁజేసినది.

హంస—అమ్మా! ఇది యాతనిస్వయంకృతాపరాధముగాని నాదోషము కాదు.

సత్య—అక్కయ్యా! అదిగో కౌశికసమేతులయి భర్తగారిటు వచ్చుచున్నారు.

[అప్పుడు కృష్ణకాశులు యెదురుగా వచ్చుచున్నారు.]

కృష్ణ—వయస్యా! రుక్మిణీసత్యభామలిటే వచ్చుచున్నారు. హంసపదికూడ వెంటనున్నది. నీవు నావెంటనుండుము.

కాశి—నేను వెంటనుండుటకు నేనేమి పిరికివాఁడనా? మంచముక్రింద నిలుచుకొని పోఁబట్టి యేమి చేయుటకును వీలులేక యాఁడుదానిచేత దెబ్బలు తినవలసివచ్చెగాని లేకున్నచో నా—

రుక్మి-సత్య—(దగ్గఱకువచ్చి) ప్రాణేశ్వరా! జయమగుఁగాక! జయమగుఁగాక!

కృష్ణ—కల్యాణులారా! శీఘ్రమేవ జలక్రీడామహోత్సవ ప్రాప్తిరస్తు!

కాశి—తథాస్తు.

హంస—(నవ్వుచు) ఈబ్రాహ్మణుని యాశీర్వచన మమోఘము.

కాశి—(కోపముతో) నాజోలికి నీవు రావద్దు. నాయాశీర్వచన మమోఘము గాకేమి? నీవరుసయేమియు బాగున్నదికాదు. ఒకనిమిషముక్రిందట రుక్మిణీసత్యభామలతో నీవేదో నన్నుఁగూర్చియే చెప్పుచుంటివి. వారు నీమాటలు విని నన్నుఁజూచి ముసిముసినవ్వులు నవ్వఁదొడంగిరి. నీకు నాకు నీప్రొద్దుటనుండియు మాటలులేవుగదా? నావిచారము వారితోఁ జెప్పవలసినంత యవసరము నీ కేమి వచ్చినది? నీయంతదానవు నీవు. నాయంతవాఁడను నేను. నీవమ్మగారి సేవకురాలవు, నేనయ్యగారి మిత్రుఁడను. దాసీపుత్రికవు నీకే యింత తెగనీలు గుండఁగా నగ్రజాతివాఁడను నాకెంత సామంత యుండవలసినది. నీకనులకు నేను తేలికగాఁ గనఁబడుచున్నాను కాఁబోలు. జాగ్రత్త.

హంస—నీకన్నులలో ననుమానము నిన్నుఁ బీడించుచున్నదిగాని నీవిషయమున నేనెవ్వరితో నేమియుఁ జెప్పలేదు, అనేకావతారములెత్తిన శ్రీమన్నారాయణునిగారి వాఁడవగుటచే నీవును గొన్ని యవతారము లెత్తనేర్చితివని మాత్రము వీరితోఁ జెప్పఁదలఁచితిని.

కాశి—ఏమి యవతారము లెత్తనేర్చితిని?

హంస—ఆయన నారసింహావతారమెత్తెను నీవు గడియక్రింద గ్రామసింహావతారమెత్తితివి.

కాశి—ఆమాటనే యెత్తవద్దని చెప్పినది.

కృష్ణ—హంసపదికా! నీవూరకుండుము. కాశుఁడా! ఉడికింపఁగోరెది యుడికింపకురు కావున దానిమాటలు లెక్కసేయకుము.

రుక్మి—కాశుఁడా! అనుగ్రహించి క్షణమాత్రమూరకుండుము. భాగ్యాఢ్యుఁడైన గోపాలదేవుని శైశవక్రీడావిహారములచేతఁ బవిత్రీభూతమయిన బృందావనమునకు వచ్చితిమి; కావున నిచ్చట విశేషములఁ గొన్నిఁటి నందగోపసూనునినోట విని సంతసింతము

సత్య—నా మనోరథ మిదియే ప్రాణేశ్వరా! అదియేనా యమునాతరంగిణి!

కృ—సుందరులారా!

ఉ. అదియే యయ్యమునాతరంగిణి తీరలో ♦ నైక పరిపూజ్యంబు; ని
    త్యాదిబృందావన మస్మదీయమగు బా ♦ ల్యక్రీడకుం దొల్లి యీ
    యదెరంగస్థలమై తనర్చె నహహా! ♦ యాయాటలుం బాటలున్
    మదికిన్ జప్తికివచ్చె నేని యిపుడు ♦ న్నాదేహ ముప్పొంగెడున్.

సుందరులారా! నాజనకుఁడు వసుదేవుఁడు నేను జనియించినకొన్ని నిమేషములకు నాకు లోకత్రయప్రశంసుండగు గంసునివలనఁ బ్రాణాపాయంబు శంకించి శిశువనగునన్నా నొడి నిఱికించుకొని యర్థరాత్రింబున మధురాపురంబునుండి వ్రేపల్లెకుం జని పురుటా లగు యశోదాదేవి మంచముపై నన్నుఁ బారవైచి యొకరెఱుంగకుండ నమ్మహోదరుగుటయు, నేను నందునియింటఁ బెఱుఁగుటయు జగద్విదిత వృత్తాంతములుగదా!

సత్య—ఈకథను నేను మాతండ్రిముఖమున వింటిని.

రుక్మి—ఇది నారదుఁడు మాయయ్యకెఱిఁగింప నే నాకర్ణించితిని,

కాశి—అలాగా! ఇంతగొడవ యున్నదని నేనెన్నఁడు వినియుండను సుండీ.

కృ—ఆ దినములలో,

సీ. బుజములఁ జల్దిచిక్కములు, ♦ మోవినిఁ బిల్లనగ్రోవి, మౌళి న
    క్కజమగు బర్హిబర్హములు, ♦ కంఠమునం గురువింద పేర్లు, కా
    ళ్లజిలుతగజ్జియు, ల్గరమున ♦ ల నున్నకగోలయు నొప్పియుండఁగా
    నిజముగ గొల్లకందువయి ♦ నేనిటుఁ గాచితి నాలమందలన్.

సత్య—అహాహా! విశ్వమోహనమైన నాఁటి మీదివ్యసుందరవిగ్రహమునుఁ జూచినవా రెంత యదృష్టవంతులోగదా!

కాశి—అప్పుడొక పశువునై యీమహాత్మునిచేఁ గావఁబడుభాగ్యము నాకబ్బ నది కాదుగదా!

హంస—అబ్బకేమి, నీకోరిక సిద్ధించియే యున్నది.

కాశి—ఏమి! నేను పశువునా! అట్లయిన మనమిద్దఱ మొకమందలోనివారమే!

హంస—అనుమానపడి కోపగింపకుము. నిన్ను రక్షించుచుంటచేతనే యీ యనకు గోపాలక శబ్దము సార్థకమైనది.

రుక్మి—కౌశికుఁడా! కథాప్రవాహముల కడ్డుగట్లు వేయకుము.

సత్య—హంసపదికా! మూండ్లడొంకఁ గదలింపకుము.

కాశి—హంసపదిక నోటికి బుద్ధిచెప్పినచో నీమూండ్లడొంక కలదు.

కృ—శ్రీబృందావన విశేషము లింకనుఁ జెప్పెదను వినుఁడు.

ఉ. హాయిగ మేసి పచ్చికల • యిక్షువు గోవుల నిమ్మహానదీ
తోయములం గుతూహలము • తో జలకేళి యొనర్చి, సందడుల్
సేయుచు వాకులంబఱచి • చిక్కులు లన్నియు విప్పి, యీతరు
చ్ఛాయల నారగించితిమి • చల్దులబువ్వము బంతు లాడుచున్.

అనంతరమందు.

మ. అనుమానంబులు లేని డెందములతో; • నాయాస్తి యొక్కింత చెం
దని నెమ్మోములతో, విముక్తకచబం • ధశ్రేణితో నొండొరుం
గనుమంబిల్చుచుఁ గేకలుం దుముకుచు • న్వ్యాపించుచుం గానని
క్కనచెట్టెక్కక యాడుకొంటి మతిర • క్తిన్గోతికొమ్మచ్చులన్.

కాళి—ఆయాట యాడుకొనవలయునని నాకుఁజిరకాలమునుండి యభిలాషము కలదు.

హంస—నీవాడితివా కోతికొమ్మచ్చి యను పేరు దానికి సార్థకమగును.

కాళి—అబ్బబ్బ! నాకీహంసవదికతో సవతిపోరు వచ్చెనదికదా! మాధవా! నా నోట నిది యూపిరియైనను రానీయ దిదేమి పాపమయ్యా!

సత్య—పానకములోని పుడకవంటి యీబ్రహ్మచారిపలుకులు సరకుసేయక మీశైశవచారిత్రము మాకుఁ గర్ణపేయముగాఁజేయుఁడు?

రుక్మి—ఉత్తరోత్తరవిచిత్రము లగుమీక్రీడలు మతిమతి, వినవలతు.

కృ—ముద్దుగుమ్మలారా! నా శైశవక్రీడ లన్నియు వర్ణించుటకుఁ జాలకాలము పట్టును. స్థానసందర్శనముచేత నెన్నియో జ్ఞప్తికివచ్చుచున్నవి. అన్నిఁటిమాట లేమి గాని యిది ముఖ్యముగా వినుఁడు.

సీ. ముచ్చి వేసినలక్క • బొమ్మ కోయనఁ బశుల్ నెమరువేయుటమాని • నిలిచియుండ
మంత్రౌషధంబుల • మహిమంబుచేఁ బలెఁ దాఁచుపాములు మెచ్చి • తలలు ద్రిప్ప
జాబిల్లి వెలుఁగునఁ • జంద్రకాంతములట్లు చేఁపన శిలలెల్లఁ • జెమ్మగిల్ల
సరకారువంబలె • ననువొప్పఁ జిగురించి మోడుమ్రోకులు నిండి • మొగ్గదొడఁగ
హరిణములుకూడ పారవ • శ్యమునుఁ జెంది చలనములు మాని కొందళ్వ • ప్పములు విడువ
నీమహీనహశాఖపై • నెక్కి తొల్లి మురళి మ్రోయించితిని జగ • న్మోహనముగ.

కాళి—ఎన్నఁడో జరిగిన యాకథవినుచు నేను కనికిపాట్లు మానియుండఁగా నిజముగా మురళి మ్రోయించినప్పుడు పశువులు నెమరు మానుటయొక యాశ్చర్యమా!

సత్య—దేవా! జగన్మోహనముగ మరల నొకసారి మురళీవాదము చేసి మమ్ము ధన్యులఁజేయ వేఁడెదము.

రుక్మి—ఆ యదృష్టమే మనకున్న యెడల మనము వ్రేపల్లెలోనే జన్మించి యుందుము.

కృ—ఇందుముఖులారా! అలవాటు తప్పుటచేత నిప్పుడది మునుపటియట్లు శ్రావ్యముగ రాదు. అదియునుఁగాక; యిట్టివాకర్యములెల్ల శైశవమే నెచ్చెలి. బాల్య ప్రాయమువంటిది మఱియొకటి లేదుగదా!

క. అతిశయ సౌఖ్యప్రదమై
సతతము శ్రోత్రసుఖ-యశోక ♦ సంవర్ధనమై
ఋతువులలోన వసంతము
గతిఁ బ్రాయములందు బాల్య ♦ కాలము మెఱయున్.

(తెరలో)

ఓవరో పరిచారకులారా! కృష్ణుఁ డెందున్నవాఁడు! తెల్లవారుచున్నది. అర్ఘ్యప్రదాన మొసంగుటకు యమునకుఁ బోవలయును.

కృ—(విలోకించి) అదిగో సాత్యకి బలభద్రుల వానిమిత్తము వెదకుచున్నాఁడు. తెల్లవాఱవచ్చినది.

కాళి—ప్రాతఃకాలమున నామొగము నగఁబడఁ విభూతి పెండెకట్టిన లేదా యున్నఁ దెల్లరేఖలు తోఁచుచున్నవి. మొలవచ్చినప్పుడు పెట్టుకొను గంధంపుబొట్టువలె చంద్రమండలము మఱింత తెల్లనై కనఁబడుచున్నది.

రుక్మి—భగవానుఁడు శీతమయూఖుఁ డస్తమింపఁ బోవుచున్నాఁడు.

కృ—కల్యాణులారా!

తే. గీ. నిశయఁ బవలును; నవ్వులు ♦ వెన్నెలలు గాఁగ
మీము ఖేందుమండలములు ♦ భామిఁ గలుగ
దనయునికి నప్పుడ్రోజనం ♦ బని చెలంగి
యేగుచున్నాఁడు సిగ్గున ♦ నబ్జవైరి

సత్య—ద్విజరాజునకు సంభవించుచున్న యాపదకు ద్విజసంతతు లెంత విలపించుచున్నవో చూడుఁడు.

కాళి—అవును. ఇది మరణదుఃఖములాగునవే యున్నది.

కృ—ఈవిహంగమముల కలకలధ్వనిని వినిట్లు భావించెదము.

తే. గీ. కమలబాంధవుఁ డనుపుత్రుఁ ♦ గనెడు వేళ
తూర్పుదిక్కనుజాలాలి ♦ దున్నహంపుఁ

బ్రసవ వేదనగతి విధం ♦ బడెడుఁ జెనికి
గుములు గూడికూసెడు పులుఁ ♦ గుల యెలుంగు.

కాశి—హంసపదికా! ఈపురిటికినీవు మంత్రసానివై బిడ్డకు బొడ్డుకోయుము.

హంస—నీవు పురోహితుఁడవై. జాతకర్మ నామకరణముల సల్పుము.

కృ—సుందరులారా! వారె బలరామసాత్యకులు వచ్చుచున్నారు. మీరింక గుడారములకుఁ బోయి, జలక్రీడోచితవస్త్రాలంకారముల ధరించి యమునకుఁ రండు. ఈనడుమ మేము ప్రభాతసంధ్యావిధి నిర్వర్తించెదము.

స్త్రీలు—చిత్తము. (అని నిష్క్రమించుచున్నారు)

(అంతట సాత్యకియును, బలభద్రుఁడును బ్రవేశించుచున్నారు)

కృ—(బలరామునితో) అన్నయ్యా! అభివాదనము సేయుచున్నాఁడను;

సాత్య—(కృష్ణునితో) దేవా! జయమగుఁగాక! జయమగుఁగాక!

కృ—వత్సా! సాత్యకీ! అవరోధజనము స్నానమునకు సిద్ధముగనున్నారా!

సాత్య—మీయాజ్ఞయే యవశిష్టము.

కాశి—అదె! నీటిచివరనే యున్నది.

బల—తమ్ముఁడా! నీ [illegible]! ఈబృందావనశీలనము, యమునాస్నానము మన చిన్ననాఁటి బాల్యమునం జేసితిమి

కాశి—అందీవనవిహారమహోత్సవము తీరినట్లా!

బల—ఇంకఁ గాళిందీస్నానమహోత్సవము తీరవలయును.

కృ—ఇప్పుడే యమునకుఁ బోయి ప్రభాతసంధ్యావిధిఁ దీర్చి, జలక్రీడ సవరింతము. రండు పోదము. (అని కొంతదూరము నడచుచున్నారు)

సాత్య—అదిగో యమునాతరంగిణి. వసుంధరాదేవి తాల్చిన కీల్జడచందంబున భాసిల్లుచున్నది.

బల—మనమిప్పుడు యమునాసైకతస్థలములమీఁద నడచుచున్నాము.

కాశి—చల్లని యీయిసుకదిన్నెలమీఁద బండుకొనుచున్నచో హంసతూలికాతల్పములమీఁద బండుకొన్నంత సౌఖ్యముగా నిద్దురపట్టును.

బల—(స్పర్శసుఖము నభినయించి) ఈసమీర మెంత సుఖప్రదముగా నున్నది.

తే. గీ. సైకతయమునాతరంగముల తుఁ ♦ పరలఁ గలిసి
కిమ్మగ నెత్తమ్మిపూదుమా ♦ రముల్ దెరసి
భక్తిఁ గాళింది పంపిన ♦ బంటువోలె
స్వాగతమునిచ్చు మనకు నీ ♦ చల్లగాలి.

కౌశి — ఈచల్లగాలికతమున నరల నాళమ్ములు యూఁతపడుచున్నవి.

సాత్య — నీకన్నులు మూఁతలుపడక తెఱచుకొనియున్న దెపుడు?

కృ — అన్నయ్యా! ఈస్థానము లన్నియు మనకుఁ బూర్వపరిచితములు సుమీ! చూఁడుము.

మ. జలజాతాక్షులఁగూడి వెన్నెలల గా ♦ సక్రీడలన్సల్పతి
ప్పలు సుమ్మీ యవి; మిత్రులం గలసి యా ♦ వ్వచ్ఛాదు కొన్నట్టి ది
న్నెలు సుమ్మీ యవి గ్రీష్మమందుఁ బసుల ♦ న్నీగంబు దాగించు దే
వులు సుమ్మీ యవి; యిన్నింటిం గనుఁగొనం ♦ బుల్కల్ త్రాయి నోఁచెడిన్.

బల — అన్నియుఁ దలంపునకు వచ్చుచున్నవి. ఇందలి మనవినోదములు మఱఁ వఁదలంచినను మఱపురానివి గదా!

సాత్య — పూజ్యులారా! మీచరణారవిందముద్రితము లయిన యీస్థలములు మాదృశ్యులకు సేవ్యము లగుపుణ్యక్షేత్రములు.

కౌశి — ఇసుకపాతరవలె తెలుఁగని లీలల నిసుకఁగట్టిపెట్టి వచ్చినవనిఁ జేయుదము. ఇదిగో నీలావతికిఁ జేరితిమి

సాత్య — అల్లదె భగవానుఁ డగుప్రభాకరుఁడు ప్రాగ్దిశాగవాక్షంబునుండి వెడలు మృగరాజుచందంబున లోకానుగ్రహార్థమై బయలుదేఱి మనకు దర్శన మిచ్చుచున్నాఁడు.

కృ — అవును.

చ. క్షితిధరనాథరాధరేంద్రమున ♦ నుద్భవ మయ్యె నినుండు ప్రాక్సతీ
వదనలలాటభాగమున ♦ భాసిలుకుంకుమబొట్టు వోలెఁ జైవడిన్
గదియఁగఁ బాణినాథు విరిఁ ♦ గౌఁగిటఁ జేర్పఁగఁ గొలఁకాప్తు నాన్
ముదముగ నంబుజాతసుమ ♦ ము ల్వికసించె దళంబు లేర్పడన్.

బల — తమ్ముఁడా!

తే. గీ. అబ్జహితుఁ డను కారాగృ ♦ హాధికారి
కిరణ మను తాళపుంజేతఁ ♦ గీ లెడల్చి
దళము లనుతల్పులను దీయ ♦ వెలికి వచ్చె
దుమ్మెదలు తమ్మిచెరనుండి ♦ దొంగలట్లు.

సాత్య — తే. గీ. ఒక్కచోఁ బట్టి పెరుగుచు ♦ మన్న వయస్య
నొండొరుల పొందఁ గిట్టక ♦ యున్న వకట!
కలువపూఁదమ్మిపూవులు ♦ కాలవశత
జ్ఞాతివైర మెందును దప్ప ♦ జాలికైన.

కాశి — తెల్లవారకముందే సామ్మంతయుఁ బడిపోయినట్లు మన మిక్కడికివచ్చి నందుకు నదీదేవత మనలనుఁ జూచి సంతోషించి నవ్వుచున్నదోయనునట్లు తెల్లదామరలు వికసించినవి. మాగోడలకుఁ బాముట కలుగఁదీసిన తెగురుముద్దవలె సూర్యబింబ మదయించినది. ఇంక మనలక కర్తవ్యమునకుఁ గడంగుదము.

బల — ఇంతకన్నఁ గర్తవ్య మేమున్నది?

తే. గీ. కమలమిత్రుఁడు దనుజవ♦ర్గంబుచేత
బాధలనుఁ బొందకుండఁగ ♦ భక్తిమెఱయ
నుభయసంధ్యల నర్ఘ్యంబు ♦ లొసఁగుచుంటు
ద్విజుల ధర్మంబు దానినిఁ ♦ దీర్చవలయు.

కృ — అట్లయిన నదీలగర్భిత మైనయంజలింబట్టి భగవానుఁ డగు లోకబాంధవుఁ బ్రార్థింతము.

కాశి — (తనలో) సంధ్యావందనమంతయు మఱచిన నేనర్ఘ్య మెట్లు విడుతును? నోటిలో నేదో గొణుగుకొనుచు నంద ఱర్ఘ్యము విడిచినప్పుడు నేను నిన్ని నీళ్ళుక్రింద బోయుదు.

అందఱు — (హస్తముల జలమంజలిం బట్టుచున్నారు.)

కృ — (సూర్యాభిముఖుఁడై,) భగవానుఁడా! లోకబాంధవా!

శా. నీవే చండగభస్తిమండలము చే ♦ నింకింతు వంభోనిధుల్
నీవే విశ్వహితార్థమై కురియుదం ♦ తే వాన మేఘాకృతిన్
నీవే చేయుదు భస్మరాశిగ వనా ♦ నీకంబు దావాగ్నివై
యీవే పెంచెద తెల్లగోఁపధుల రే ♦ లిందుండవై వెన్నెలన్.

బల — దేవా! చండమయూఖా!

క. జగదుజ్జీవనకిరణము
నిగమాత్మక! మిత్ర! నీదు ♦ నిత్యోదయముల్
జగదస్తంకరణము లో
యగదంకర! నీయవారవా ♦ రా స్తమయంబుల్.

పార్శ్వ — స్వామీ, పద్మబాంధవా!

తే. గీ. దక్షిణోత్తరాయణములు, ♦ దగ్నపౌర్ణ
మాసులుం గ్రహణంబులు ♦ మాసములును
మదృతువు లహోరాత్రములు ♦ సంధ్యలు నివి
తపన! నీదుసంచారభే ♦ దములె కావె!

కాశి — తండ్రీ! సూర్యనారాయణమూర్తి.

ఉత్సాహమాలిక.

ఎవనిఁజూచి కలువపూవు ♦ లిట్టె యాతి ముకుంచునో
యెవనిఁ గాంచి తమ్మి వంత ♦ లెగఁగ వేసి నవ్వునో
యెవని మొగము కుంకుమట్టు ♦ లెఱ్ఱవాఱి యుండునో
యెవనియెండ తీక్ష్ణమౌ కాఁగ ♦ నెల్ల చలియుఁ బోవునో
యెవఁడు పొడమ బొజ్జలోన ♦ నెంచరాని యాఁకలౌ
నెవఁడు క్రుంగఁ గనులనిండ ♦ హెచ్చునిద్ర వచ్చునో
యెవఁడు చందమామఁ గూడి ♦ యేగు తోడిదొంగనా
పవలు చేయునట్టినీకు ♦ బత్తితోడ మ్రొక్కెదన్.

కృ—హే భువనత్రయగేయ! శతమఖచతుర్ముఖప్రముఖనిఖిలబర్హిర్ముఖ సంస్తూయమానమహామహిమాభిశోభితాయ, పద్మినీమత్తకాశినీకిలికించితక్రియాపాటవపాస్త్రాయమానసహస్రమయూఖమండలవిభ్రాజమానాయ, మహాంధకారదంతావళనిర్మూలనాభీలసంరంభసమన్వితహర్యక్షాయ, సర్వకలుషాపహారిణే భగవతే, కర్మసాక్షిణే, నమస్తే, నమస్తే, (అని నీరు వదలకముందే కృష్ణుని చేతిలో పైనుండి తమ్మపడును.)

కృ—(మహాకోపముతో నుదకము పాఱఁబోసి) అరేదురాత్మా! గర్వాంధకార ప్రమత్తహృదయ! నిష్కారణమహాత్మపరివాదశీల! ఎవఁడవు రానీవు (అని పైకిచూచును)

బల—(తెల్లఁబోయి) తమ్ముఁడా! గోపాలకృష్ణా! ప్రళయకాలరుద్రభయానకమూర్తివై, శ్రవణపుటంబు లవియనఱచుచు, నయనయుగళంబులనుండి కోపవిస్ఫులింగంబులు రాల నేల యీరీతి నాగ్రహించెదవు? సకలలోకారాధ్యుఁడ వగునీయెడ నెవ్వఁ డేమియపచారము గావించెను? సత్వరంబ చెప్పుము?

కృ—అన్నయ్యా! సకలభూతముఖ ప్రపరిభావుండగు ప్రభాకరునకు విధివిధానపురస్సరార్ఘ్యప్రదానశీలుండనై హస్తాంజలిన్యస్తపవిత్రతరంగిణీజలుండనై, నిమీలితనయనారవిందుఁడనై హృదయారవిందనిష్ఠితమందరవరోజనీమనోహరుండనై పరమనిష్ఠాగరిష్ఠుండనైయుండ, దోసిట నిష్ఠీవనంబుపడియె. అదియే కోపకారణము.

తే. గీ. తనకు నపకార మీరీతి ♦ జనన మొంద
మహితకోపాగ్ని దందహ్య ♦ మానుఁడైన
కమలహితనేత్రి విస్ఫులిం ♦ గం బనంగ
తమ్మలపుటుమిబడియె హ ♦ స్తంబునందు.

సాత్య — కటకటా! యదుకుంజరకోపవహ్నిశలభాయమానుఁడగు మందభాగ్యుఁ డెవ్వఁడో గదా!

కాశి — (తనలో) కొంపతీసి యీపని నేను చేయలేదు గద! ఏమో పాపకర్మ మెవ్వఁ డెఱుఁగును!

కృ — (సంహారోద్యమముతో) శ్రీమచ్చతురానన, పంచానన, షడానన, సహస్రానన, సహస్రాయుధ, పంచాయుధ, శాపాయుధ, సిద్ధ, సాధ్య, యక్ష, గరుడ, కిన్నర, కింపురుష, విద్యాధరాద్యఖిలఖేచరసమూహంబులుం దదగ్రభాగము ప్రతిఘటించి నిల్చిన నిల్చుఁగాక; దైత్యరాడ్గర్వనిర్భేదకసుదర్శనమహాభిధానమై, బృందారకేంద్రత్రిదివసామ్రాజ్యకసంరక్షణధురంధరమై, ప్రళయసమయకృశానుశిఖాప్రతిమానజాజ్వల్యమాన మహాకీలికాశోభితంబై యలరు నిర్వక్రవరాక్రమస్ఫురితచక్రాయుధంబుచే నద్దురాత్ముఁ గృతాంతనికాంతంబున కతిథిం గావించెద.

బల — తమ్ముఁడా! ఆదురాత్ముఁడు తప్పక వధ్యుఁడు. నీవు కరుణాళుఁడవై యుపేక్షించినను మదీయముసలంబున వానిమస్తకమును శకలీభూతముఁ గావించెద.

సాత్య — ఈయపరాధి యెవఁడో ముందు మనమారయవలయును గదా!

కాశి — ఈజలదేవత నడిగినఁ దెలియునేమో!

కృ — (కోపముతో) ఓయమునా జలాధిదేవతా! అకుటిలస్వభావు నామధేయాంకుల నెఱిఁగింపవేని దుష్టరాక్షసవిరాముఁడగు రఘురాముండు రత్నాకరము బంధించినచందంబున ని న్నిపుడు బంధించెద. కావున సత్వరంబ తెలియఁబల్కుము.

[తెరలో]

ఓమహాత్మా! ఈయపచారము గావించిన మందభాగ్యుఁడు, నిషధగిరిపై నున్న మణిపురం బేలు గంధర్వుండు, గయుండు.

కృ — ఓబలదేవా! ఓసాత్యకీ! ఇటువినుండు.

చ. జలనిధు లింకుఁగాక, కుల ♦ శైలము లేడును గ్రుంకుఁగాక, యీ
జ్వలనుఁడు వేఁడిమి న్విడిచి ♦ చల్లదనంబును దాల్చుఁగాక, యీ
జలజహితుండు పశ్చిమది ♦ శం జనియించెడుఁగాక యింక నా
ఖలు గయు నుత్తమాంగమును ♦ ఖండనచేసెదఁ జక్రధారలన్.

మఱియు,

ఉ. ఈవిధి నద్దురాత్ము వధి ♦ యింపక పోవుదు నేని దేవకీ
దేవికిఁ బుణ్యమూర్తి వసు ♦ దేవునకుం దనయుండ గా నిఁకన్.
ధీవినుతప్రభావు లగు ♦ దేవరకే ననుజుండఁ గానిఁకన్
బావన మైనయట్టి యదు ♦ వంశమున న్జనియింప లే దిఁకన్.



# గయోపాఖ్యానము.

## ద్వితీయాంకము.

[అప్పుడు పుష్పదంతుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

పుష్ప—(తనలో) నేఁటిప్రాతఃకాలంబున గయమహారాజుగారు నన్నుం బిలిచి "మంత్రి పుష్పదంతా! నేను చిత్రరేఖాసమేతుండనై బ్రహ్మలోకమున కరిగి భక్తవత్సలుఁ డగుపరమేష్ఠి నుపాసించి వరములం బడసివచ్చెద. నేను మగుడ వచ్చువఱకు యీపురము శ్రద్ధతో రక్షించుచుండుము" యనియానతిచ్చిచనిరి. పద్మగర్భుండు వారిభక్తికి మెచ్చి యేవరంబులిచ్చెనో. బ్రహ్మలోకమునందలి విశేషములెట్టివో. గమనింగొనవలెనని నాకుఁ గుతూహలమగుచున్నది. కావున, మహారాజుగారు వచ్చిరేమో తెలిసికొని వారిం దర్శించెద. (అని ఆకాశమువంకఁజూచి) ఓయీ! కంచుకీ! మహారాజుగారు బ్రహ్మలోకమునుండి వచ్చినారా? ఏమనుచున్నావు? ఇప్పుడే వచ్చి మహారాజుగారు భార్యాసమేతులయి మందిరమునఁ గూర్చున్నారా? సరిసరి; నేనిప్పుడే పోయి వారిని సందర్శించెద.

ఇది విష్కంభము.

[అంతట గయుఁడు, వానిభార్యయగు చిత్రరేఖయు, మంత్రిపుష్పదంతుఁడును ప్రవేశించుచున్నారు.]

పుష్ప—బ్రహ్మలోకావలోకనమ్మున ధన్యులగుదంపతుల కభివాదము సేయుచున్నాఁడను.

గయ—మంత్రీ! పుష్పదంతా! నీకుఁ గల్యాణమగుఁగాక.

ననవరా తజ్జలమందు గ్రుంకులిడి శ్రీ ♦ శైలాంతర ద్వాబ్జ సం
జనితస్వాదు మరందపూర సలిలము ♦ స్నాంగోష్ఠిగా గ్రోలితిన్.

ం—పుష్పదంతా! వాసీనాకవాసనులిద్దఱ నా కుగ్గ్నని .. శ్రీశైల మాను

చతురరసాపానానమునన్ ♦ సల్పుచుం బంగ న్నారి యాపగ
స్వతిని మనః ప్రమోదమున ♦ సల్పి; శ్రీయ కేలిమాటి భా
రతియును బాగ్రీణానాథుపది ♦ రంజిలజేసెదు; నా పురాణపం
పతులను నెంత చూచినను ♦ భావము లాఁదనివోక సత్తుగన్.

పుష్ప—అమ్మా! మీయదృష్ట మస్యజనదుర్లభము.

గయు—పుష్పదంతా! ఇప్పుడు నిశ్చయముగా నే నత్యుత్కృష్టజీవనుఁడ నైతిని విన్లన;

మ. అరవిందాసనుఁ గొల్వఁ బోవుటను ధ ♦ న్యంబయ్యె దేహంబు త
త్పరణాబ్జంబులఁ బూజసేయుటను శ ♦ స్తంబయ్యె హస్తంబు- శ్రీ
ద్వరమూర్తిన్గనుట న్ఫలంబు గనె నే ♦ త్రద్వంద్వ మాతేజము
స్థిరభక్తి న్మది నిల్పఁ బావనతగాం ♦ చె న్మానసం బెంతయున్॥

చిత్ర—ప్రాణేశ్వరా! ఆనందనిలయంబగు నాసత్యలోకంబు సంప్రాప్తించినందునే యింతవిరవశుల మగుచుంటిమి, భక్తజనవత్సలుఁడు, దయామయుఁడు : పద్మగర్భుఁడొసంగినవరంబులందుఁ బిన నెంతనిపశాత్ముల నుగుదు మోశదా?

పుష్ప—దేవా! మాటలసందండి నడుగ మఱచితిని భగవానుఁడు కనకగర్భుఁడు మీకేమివరంబు లొసంగెను?

గయు—చతురాననుఁడు నాభక్తికి మెచ్చి నన్ను వరంబులఁ గోరుకొనుమనియెడి అప్పుడు నేనిట్లంటిని.

మ. ధనమీయంగదె, పాత్రయాచకులకో ♦ ద్దానంబుఁ గావింపఁగా
ఘనవాహోబల మీఁగదే కుజనశి ♦ క్షా దీనరక్షార్థమై
మనసీయంగదె చాలఁ గాలమున బ్ర ♦ హ్మజ్ఞాన మార్జింపఁగాఁ
జనసీయంగదె ధర్మమార్గమున ని ♦ చ్చల్లోక సౌఖ్యార్థమై.

పుష్ప—ఇంతకంటె నభ్యర్థనీయము లగువరము లేవి?

చిత్ర—ఈవరము లనుగ్రహించుటచేతనే మేము కడుధన్యుల మైతిమి.

గయు—కావుననే యదిమొదలు నా కు ముక్తిమీఁదనేగాని జీవితముమీఁద నిచ్ఛ లేదు.

పుష్ప—అమంగళము ప్రతిహతమగుఁగాక!

చిత్ర—కటకటా! అశ్లీలముల నాడెదరేల?

చ. సరివరి యేటిమాట లిటు • జాలను గాముడి సూర్యపుత్ర! యా
వరవిజగర్భ పాదజల • జద్వయసేవలఁ దొంటికన్నను
స్థిరవిభవంబులం బడయఁ • జెల్లును గాని సుమంగళంబు లీ
సగశిని బల్కఁ నొప్పునె వి • షాదము గల్గదె విన్నవారికిన్.

గయుఁడు—(భార్యమీఁదఁ జేయివేసి) ఓమణిపురాధినాథగంధర్వసార్వభౌమ పట్టమహిషీ! నిరంతరవసంతవశుంభత్ప్రతాపోదయుండను. బ్రహ్మాదయుండును నను నీ గమిఁ దశ్లీలములచేత భంగమొందునా? అదియునుం గాక; యిప్పుడు నాసహజ ప్రతాపంబునకుం బరమేష్ఠిపరిపాలిభావంబు తోడ్పడ యుండ భయమున కవకాశమే లేదు. ఆహాహా! యువిద లెంత భీరువులు! అకారణాతిశయమునఁ బరవశుండనై పలికిన యర్థములేని వాక్యమునకింత వెఱవవలయునా?

చిత్ర—హృదయేశ్వరా; ఆమాట యెన్నోట వెలువడినది మొదలు మనస్సు కీడును శంకించుచున్నది.

పుష్ప—అమ్మా! బాహ్యాంతరదౌర్బల్యమే హేతు కారణము.

(తెరలో)

తే. గీ. ఒసరఁ బట్టాభిషేక మ • హోత్సవముల
మణిపురాధీశు లెక్కుడు • మదగజంబు
కటకటా! పోయె దివికి ని • ష్కారణంబ
చూటమగు నింద్రగజమును • జూడ ననఁగ.

(అందఱుభయమునొ నాలకించుచున్నారు.)

చిత్ర—ప్రాణేశ్వరా! ఈయశుభమువే నాహృదయము కంపమొందుచున్నది.

పుష్ప—అమ్మా! అతిభయమునంగి మహారాజా మనస్సును గలంచుచున్నది.

గయుఁడు—(భార్యపైఁ జేయివైచి) సుందరీ! ఇదిభయమునకు స్థానము గాదు ఏల యన; నాభద్రగజము నాపితృపితామహుల నాఁటనుండి యుండుటచే మిక్కిలి ముసలిది వృద్ధజంతువులు కాలధర్మము నొందుట లోకవృత్తమెఱింగిన వారికి వింత కాదు. అదియునుం గాక,

తే. గీ. మదపు టేనుంగు పడెనంచు • నలుగ నేల
జన్మమెత్తినపిదప నె • వ్వంతు డైన
బ్రహ్మకల్పాంతమునుదాక • బ్రతుకఁ గలఁడె?
మరణ మెప్పుడైన నున్నదే • మనకు నెల్ల.

కావున సర్వజనులును మరణమునకు సిద్ధముగ నుండవలెను,

[తెరలో]

నిజము! గంధర్వా! నిజము! సర్వజనులును మరణమునకు సిద్ధముగా నుండవలయును. నీవును సిద్ధముగ నుండుము.

తే. గీ. అవనిభారంబు హరియింప • యదుకులమున
నవతరించిన యాదినా • రాయణుండు
దేవకీసూతి నీతలఁ • ద్రెవ్వ సేయుఁ
జండతర మహా సుదర్శన • చక్రధార.

చిత్రి & గయు.—హా! పరమేశ్వరా! (అని మూర్ఛిల్లుచున్నారు.)

పుష్ప—(చెవులు మూసికొని) హరిహరీ! ఎంతకష్ట మెంతకష్టము!

గయు—(తెలివి దెచ్చుకొని) హా! అతిదారుణ మైనయీవచనము లెవ్వరివో గదా!

పుష్ప—దేవా! ఇది యశరీరవాణి యని తోఁచెడిని.

చిత్రి—(మూర్ఛఁ దెలిసి దుఃఖముతో) హా! హృదయేశ్వర!

తే. గీ. దేవకీసూతి సుజనవి • ధేయుఁ డండ్రు
భక్తవత్సలుఁ డండ్రు కృ • పాళుఁ డండ్రు
అసురకంఠలుంఠక మైన • యాతనిచక్ర
మనఘ ధులమీఁద కె • ట్లరుగునొక్కొ!

పుష్ప—అమ్మా! కారణ మరయుద మిందుకై యూరడిల్లుము.

చిత్రి—కారణ మరయ నేల! చంపఁదలఁచినవారికిఁ గారణ మెందుకు.

మ. బలి యొగ్గె మొనరించె విష్ణువటు; లో • కం బెద్ది గానింపె వి
ప్రలబాహాబలశాలి వాలి రఘువం • శస్వామికిన్; ధారుణిన్
బలవంతు ల్బలహీనులం బొదివి చం • పంజూతురే కాని, హా
కలదే ధర్మపథానువర్తనము లో • కంబందు నెవ్వారికిన్.

గయు—ఓవాసుదేవా! శిష్టవత్సలా!

సీ. అగ్నిసాక్షిగఁ గొన్న • యంబుజాక్షిని కాని కలనైనఁ బరకాంత • దలఁచియుండఁగ
నాటపాటలనైన • నరసి సత్యమె కాని యనృతంబు నెన్నఁడు • నాడియుండఁగ
నీయలు హెచ్చుకొలంది • సేవఁజేయుట కాని మానసంబున నిన్ను • మఱచియుండఁగ
పలుక యొంతగ నున్న • నభయమిచ్చుట కాని శరణన్న బగతునిఁ • జంపియుండఁగ

గీ. చేయరాని దుష్కార్యము • ల్సేసియుండఁగఁ బలుకరానిదుర్భాషలఁ • బలికియుండఁగ
నడువరాని దుష్పథముల • నడచియుండఁగ నిట్టి నన్నుఁ జంపఁ గారణ • మేమియుండఁగ!

పుష్ప — ఓ యశరీరవాణీ! భగవంతుండగు దేవకీనందనుఁడు నిష్కారణంబుగ నీమహాత్మ్య మేలఁ జెఱుపఁ దలఁచె.

(తెరలో)

ఈదినమునఁ బ్రాతఃకాలమున బ్రహ్మలోకావలోకనకుతూహలమ్మున గయుఁడాకాశగమనంబు సేయుచు యమునాతరంగిణిలోఁ బ్రభాకరునకు నర్ఘ్యప్రదానతత్పరుఁడగు వాసుదేవుని హస్తాంజలి నిష్ఠీవనంబు వైచె. అదియే వాసుదేవునకుఁ గ్రోధకారణము.

గయుఁడు — హా! దేవకీనందనా! ఆకాశసంచారినై ధరామండలంబున దేవర యర్ఘ్య మొసంగుచుండుట యెఱుంగక నిష్ఠీవనంబు చేసితిని. అంతియకాని బుద్ధిపూర్వకముగా నపచారంబు సేసియెఱుంగ. నీవా సమయంబున మహీతలంబున నున్నవార్త విన్న నీచరణాబ్జంబులకడ వ్రాలక యున్నకుందునా? నీసందర్శనమునకంటె సత్యలోకావలోకన మెక్కుడు ఫలదాయకమే! అదియునుంగాక నీవు.

శా. గంధర్వ ల్పరసిద్ధసాధ్యగరుడు ♦ ల్గారా పృథక్కర్తల్గా
గంధర్వుండవు, నీవుభక్తుఁడ నిమం ♦ గాకన్యుఁ గొల్వన్ప్రభూ
సింధూ! దోసము లెన్నివారి నయినన్ ♦ జేపట్టు దేదోషసం
బంధంబున్ గనరాని నన్ను వధియిం ♦ పం బూనుటల్ న్యాయమే!

చిత్రి — ఆర్యా! మందభాగ్యుల నెవ్వ రుద్ధరింపఁ గలరు!

సు. మునులున్, జ్ఞానులు, భూసురు ల్ప్రీతిసనం ♦ బు న్దేవతాదర్శనం
బున భక్తాళి కకాలమృత్యుహరణం ♦ బు న్నాభ నాకంబు నా
వని భాషింతురు, భారతి పహితు బ్రి ♦ హ్మం గాంచి సేవించి వ
చ్చిన నాకు న్విపరీతమై బరిణమిం ♦ చె న్దత్ఫలం బక్కటా.

పుష్ప — దేవా! దే?

ఆ. వె. ఆయురధిక మగుటె ♦ యాశీర్వచనశక్తి
శాపకారణమునఁ ♦ జావు గలదె?
క్షయము, వృద్ధి, సకల ♦ జంతుజాలములకుఁ
గాలవశముచేతఁ ♦ గలుగుఁ గాక.

గయుఁడు — పుష్పదంతా! నీమాటయే నిజమని తోఁచుచున్నది, కాదేని.

మ. చలికి న్వానకు నెండ కోర్చి శతవ ♦ ర్షంబు ల్సమాధి న్హిమా
చలశృంగంబున నే నొనర్చుతప మా ♦ చందంబున న్నేఁడు ని
ష్ఫల మాయనే, కుర లిచ్చినట్టిపరము ♦ ల్వ్యర్థంబు లాయనే! దురా
కలచే నుత్కటకాన్క ఘోరతపమా ♦ ల్పంబాధకంబు ల్సమీ.

ఇందు నాయదృష్ట మన్యథా యగునేని,

తే. గీ. హోమములు యాగములు విప్ర ♦ భోజనములు;
నిగమపాఠము, లిష్టులు ♦ నిష్ఫలములు;
అమరసేవలు, నతులు ని ♦ రర్థకములు;
నీరజాక్షాదిదివ్యులు ♦ నిష్కరుణులు.

చంద్ర—కటకటా! నేనిఁక నాయదృష్టమునే నిందించుకొనవలసియున్నది. ఏలయన

తే. గీ. నేను నోఁచనినోము లే ♦ నేను మ్రొక్కఁ
బోని వేల్పు, నా చూడని ♦ పుణ్యభూమి,
లేను సేయని దానంబు, ♦ లెందు లేవు!
యిన్నిఁటి ఫలంబు లిటు లయ్యె, ♦ నేమిచెప్ప!

హరి—దేవీ! ఇట్లు మనయదృష్టములనిందించుకొనినఁ బ్రయోజనమేమి? నేను ప్రియోపవిష్టుండనై చిత్తసమాధానంబు స్వీకరించి విపత్పరిణామంబు నిరీక్షించుచుండెద. కావున, నాయెడ నీ యాసవీడి యంతఃపురంబునకుం జనుమా. నీవెల్లవిధంబులం ధన్యవు.

మ. వరవంశంబున జన్మ మొందితివి, నా ♦ భాగ్యంబున న్పత్నివై
చిరకూర్మిన్ మెలఁగి తెల్లగురుల ♦ సేవించి మెప్పొంది తీ
సరి నీకును నాకుఁ దీఱె ఋణమో ♦ చంద్రాస్య నన్నున్ నిరం
తరముగా నెమ్మది నందుకొమ్ము కరుణ ♦ న్సైరింపు నాతప్పులన్.

ఓయీ! పుత్రచంద్రా!

మ. చెలివై చుట్టమవై యమాత్యుఁడవునై ♦ సేవించి తిన్నాళ్లు ని
శ్చలభక్తిన్ సతమున్; నీసహాయమున రా ♦ జ్యం బూర్జితం బయ్యె; పి
ల్లలకు న్నిర్జితసంబు గోలనుమి యి ♦ ల్లా లెంతయు న్నాదు బి
డ్డలు నీ బిడ్డలు నీదె భార మిటు లే ♦ ట న్నొంచు నిశ్చింతతో.

చంద్ర—హా! ఎంతకష్ట మెంతకష్టము. నేను క్షమించుటకు మీవలనఁ దప్పు లెన్నఁడైనఁగలవే? మీగతవచనములు నాహృదయమును విదారించుచున్నవి. (అని యాకసమువంకఁ జూచి) ఓ చక్రపాణీ! నంద నందనా!

సీ. అన్యకాంతలు తల్లు ♦ లని మనంబున నెంచు పరమపావనుఁడు నా ♦ ప్రాణవిభుఁడు
అధికారులకు లేని ♦ హాని చేయఁగలేని పరకృపాళుండు నా ♦ ప్రాణవిభుఁడు
మూఁడు మూర్తులసేవ ము ♦ ప్పొద్దు లొనరించు భక్తశేఖరుఁడు నా ♦ ప్రాణవిభుఁడు
జగము క్రుంగినఁగాని ♦ సత్యంబు తప్పని ప్రథమానకీర్తి నా ♦ ప్రాణవిభుఁడు

తే. గీ. విష్ణుదేవుండు తనపట్టు • విడుచు నేని
బిసరుహాసనుఁ డభయంబు • నొసఁగు నేని
వెండి నినుఁ జూచుభాగ్యంబు • నుండు నాకు
నిరత మగు నేని కడచూపు • లివియె మనకు.

చిత్రి— (దుఃఖించుచు భర్తృకాళ్ళమీఁదఁబడి) జీవితేశ్వరా! మీకు సర్వదా మంగళమగుఁగాక! మీయాజ్ఞబలమే నన్నింతవరకుఁ బంపుచున్నది. మనసుమనసున లేదు. నడువఁ గాళ్లు రాకున్నవి. నావలని నేరములు క్షమియింపుము. నాకు సెలవొసంగుము (అని లేచి కొంచెము నడచి, తనలో) ఆహా! ప్రీతిన యొసఁగినప్పుడే నాపతికి మరణంబు తప్పదనుకొంటి. ఇంక మరల నీయనను జూచు టెక్కడిది? ఈగండము గడచినచో నీయన పునర్జన్మమెత్తినట్లే: అంతటి మహాభాగ్యం బెంతటివారికి లభియించును? ప్రీతికి ధరణీచక్రమున నున్న భాగ్యభోగ్యముల ననుభవించెదు సౌభాగ్యవతి యీయనయున్నచో నింతమాత్రమేల వచ్చును? ఏమైనఁ గానిమ్ము; ఈయనకు శుభోదర్కముగా నిష్టదైవంబులఁ బ్రార్థింప నరిగెద

సీ. నామనోహరుఁ గాచి • నన్నుఁ గరుణింపరే వేల్పులార! పుడమి • వేల్పులార!
నాప్రాణవిభుఁ బ్రోచి • నన్నుఁ బాలింపరే సిద్ధులార! రణసి • సిద్ధులార!
నావల్లభుని గాచి • నన్ను మన్నింపరే యక్షులార! బలహ • ర్యక్షులార!
నానాథుఁ గృపనోమి • నన్నుఁ గాపాడరే మానులార! సురస • యానులార!
గీ. దిక్కు లేనివారలకెల్ల • దిక్కు మీర గతి దొలంగు వారలకెల్ల • గతియు మీర
మొఱలు వినరయ్య! రారయ్య • బ్రోవరయ్య! గయుని రక్షింపరయ్య! య • న్గావరయ్య!
(నిష్క్రమించుచున్నది.)

గయు— పుష్పదంతా! నీయునికియు నాప్రయాణమునకుఁ బ్రతిబంధకమే.

పుష్ప— స్వామీ! ప్రభుభక్తిప్రేరితుండనై యెదురాడలేక పోవుచున్నాఁడఁ గాని, మిమ్ము విడువ నామనసొప్పకున్నది.

గయు— నీభక్తికిఁ జాల సంతసించితిని; నగరప్రదక్షిణము చనుము.

పుష్ప— నీకు శుభప్రయాణమగుఁగాక; బ్రహ్మ నీకుఁ బ్రసన్నుఁడగుఁగాక; నీ సద్గుణంబులు నిన్నుఁ గాచుఁ గాక.

క. అతనింద మోపితనపై
నవచారముఁ జేసినట్టి • యపరాధి మహా

[అప్పుడు సరస్వతీ సమేతుండై బ్రహ్మ ప్రవేశించుచున్నాఁడు.]

బ్రహ్మ—సరస్వతీ! నేఁడుదయమున మనవద్ద వరములఁబడసిన మణిశృంగాధినాథుఁడగు గంధర్వుఁడు పొరపాటున వాసుదేవుని హస్తాంజలి నిష్ఠీవనముఁ జేసినందున హరి వానిం జక్రనిహతునిఁజేయఁ బ్రతిజ్ఞఁ బట్టెనని నారదుఁ డింతకుమున్నె నాకెఱిఁగించిపోయెను.

స—అటకటా! గయుని కింతలో నెంతకష్టము సంభవించెను.

గయుఁడు—(ప్రవేశించి)

తే. గీ. సచ్చిదానందమయమూర్తి • శరణు శరణు
శారదాసుందరీనాథ • శరణు శరణు;
సత్యలోకైక మందిర • శరణు శరణు
జలజగర్భ శతానంద • శరణు శరణు.

మఱియు నో దేవ దేవ.

శా. నీనిద్రల్ప్రళయంబులీజగతికి • న్నీ మేలుకోల్ సృష్టి యౌ
నీనిట్టూర్పులు వేదముల్ ప్రణవమే • నీగద్దె నీమూర్తి వి
జ్ఞానైకాత్మక నిర్విబంధము మన • స్సంబున్ భవద్వ్యక్తి, నీ
యానందంబు ముముక్షుసంతతికి బ్ర • హ్మానంద మోయీశ్వరా.

మహాత్మా! హిరణ్యగర్భ! ఆర్తావనదీక్షాపరతంత్ర! రక్షింపుము రక్షింపుము.

బ్రహ్మ—గయుఁడా! నీయార్తి నే నెఱుఁగుదును. నీచరిత్ర సింహమువలలంక పుట్టించి యేనుఁగును శరణంబు వేఱు లేనిదగుచున్నది. ప్రతినఁబూనినవాఁడు పద్మనాభుఁడు; ప్రయోగింపఁబడునది మహాచక్రము. అది యెవ్వరు నివారింపఁగలరు? అతఁడు మహావిష్ణువు, కాని, మనుష్యుఁడు కాఁడు. అతని మహామహిమల సంగ్రహముగాఁ జెప్పెద వినుము.

ఉ. వేదము లుద్ధరించెఁ బృథి • వీధర మెత్తె ధరిత్రిఁ గాచెఁ బ్ర
హ్లాదుని నేలె; నబ్బలి న • డంచెను మాపెను క్షత్రియాన్వయం
బాదశకంఠునిం దునిమె • నబ్ధికి సేతువుఁ గట్టె యాతఁడే
యాదవుఁడయ్యె భూభరము • నంతయుఁ బాపఁగ ద్వాపరంబునన్.

గయుఁడు—హా, హతోఽస్మి హతోఽస్మి! ఇంక నాకు దిక్కెవ్వరు?

బ్రహ్మ—ఇదిగోఁ జెప్పెద వాపోక వినుము.

తే. గీ. పద్మనాభుఁడు నినుఁగూల్చ • బ్రతినఁ దాల్చె
వానిఁ గడువఁబుట్టున • ర్భకుఁడ నేను

బిడి ముక్తిప్రమదా విహారకృతికా ◆ ప్రేంఖోలికా శోభాకరం
బిడి కామాద్యరివర్గదుర్గమ మహీ ◆ భృద్దుర్గరాజం బరుక్.

నేనిప్పుడు పోయి యానాగభూషణు శరణు వేఁడెదను. (అని నడచుచున్నాఁడు.)

[అంతట శంకరుఁడును, పార్వతియును కైలాసంబునఁ గూర్చుండి
కనఁబడుచున్నారు.]

పార్వ—దేవా! రామచరిత్రంబు మీనోట నెంత వినినను దనివితీరకున్నది.

శంక—దేవీ! నారాయణావతారుఁడగు శ్రీకృష్ణునిచరిత్రంబుముందర రామ చరిత్రం బేపాటి? వాసుదేవునిలీలలు లోకత్రయగేయములు

గయు—(ప్రవేశించి) దేవాదిదేవా! శరణు శరణు.

తే. గీ. జయ మహాదేవ దేవేశ ◆ జయగిరీశ
జయ శరన్మేఘనిభ గాత్ర ◆ జయత్రినేత్ర
జయగజేంద్రాసురవిరామ ◆ జయ పురారి
జయ కరన్యస్త ఖట్వాంగ ◆ జయశుభాంగ.

సీ. ఎవ్వాఁడు నయనాగ్నిఁ ◆ గ్రొవ్విన పువ్విల్తు నిమిషార్ధమునను ◆ నీఱుఁ జేసె
నెవ్వాఁడు చిటికలో ◆ నేనుమోములుగల్గు నాళీకగర్భుని ◆ నలువఁ జేసె
గుబురుంబు లూడ్చిన ◆ కోడెత్రాఁచులకుంపు మేన నెవ్వఁడు దాల్చె ◆ మేలినగలు
కదలి ద్రిప్పఁగఁబుట్టు ◆ కాలకూటవిషంపుముద్దఁ దేనె వెన్న ◆ ముద్దలట్లు

తే. గీ. పునుకదండ లెవ్వానికిఁ ◆ బూలసరులు
పులికళాస మెవ్వనికి ◆ జిలుగువలువ
పూవచందురుఁ డెవనికి ◆ బొమిడికంబొ
యమ్మహాదేవుఁ గనుఁగొంటి ◆ నార్తిదీఱ.

శంక—గయుఁడా! లోకత్రయైకపూజ్యుండవు నందనందనుని హస్తాంజలి నీవు బ్రహ్మలోకమునకు బోవున నిష్ఠీవనంబు చేసితివని మేము దివ్యదృష్టిని గ్రహించితిమి, నీకిష్టదైవం బగుకమలాసనుఁ డేల నీకు శరణ్యుఁడు కాఁడయ్యె?

గయు—మహాత్మా! అతం డసమర్థుఁడై నీపాలికిఁ బొమ్మని యానతిచ్చె.

శంక—(తనలో)

మ. గయునిష్ఠీవన మేలొకో పడియె, నా ◆ కంజాక్షుహస్తాంజలిన్
దయ యొక్కింతయు లేక రోషమున గం ◆ ధర్వప్రభుం ద్రుంప శ్రీ
దయితుం డేల ప్రతిజ్ఞఁ జేసె విధియుం ◆ దర్కింపకుండ స్వయన్
గయు నాపాలికి నేల పంపవలె, హా ◆ కర్తవ్య మేమిత్తరిన్.

(వికారముగా) నరుఁడా!

తే. గీ. నళిననాభువిరోధులు • నావిరోధు
లతనిభక్తులు నాభక్తు • లగుచు నుందు
రతనికిని నాకు భేదంబె • దరసిచూడ
నతనివైరికి నీకట్టు • లభయ మిత్తు.

అతని చక్రప్రయోగంబు మరల్ప నాతఁడె సమర్థుఁడు. కావున, నాతని పాదంబులే యాశ్రయింపుము.

గయుఁ—హా! హతోస్మి, హతోస్మి. (అని మూర్ఛిల్లుచున్నాఁడు.)

(తెరపడును.)

గయుఁ—మూర్ఛ తెలిసి) హా! ఇప్పటికి నా ప్రయత్నములు భగ్నములయినవిగదా?

తే. గీ. అరిగినాఁడను కొండంత • యాసతోడ
కమలగర్భుఁడో శంభుఁడో • కాచు ననుచు
వచ్చినాఁడను భ్రష్టైను • వగపుతోడ
నాశ లడుగంట దైవోప • హతుఁడనగుచు.

అవును నాకింక నాశలెటు లుండును?

తే. గీ. ఖలుల నేనియుఁ గావఁ గం • కణముఁ దాల్చు
నళిననాభుండు భక్తుని • నన్నుఁ జంపఁ
బ్రతినఁ గైకొన రక్షించు • వాఁ డెవండు?
కంచెయే చేను మేసినఁ • గలదె దిక్కు?

పోనిమ్ము. ఏదోవిధంబున నాయవస్థను సమర్థించుకొని మరణంబునకు సంసిద్ధుఁడనై యీయందున్న సర్వవిధముల నేరినైన నాశ్రయించి ప్రాణంబు నిలువఁబెట్టుకొనవలెనని యున్నది. కాని, చావునకు మన సొప్పుటలేదు. ఇందాశ్చర్యమేమున్నది? మృత్యుభీతి జంతుజాలమునకు సహజంబుగదా!

ఆ. వె. ఎన్ని తెగులు లున్న • నెన్ని దుర్దశ లున్న
బ్రతుకఁ జూచు దేహి • బహువిధములఁ
జావు పేరు దలఁపఁ • జలియించు ధైర్యంబు
జ్ఞానికైన మేటి • మానికైన.

ఆఁ! భీతి వదలించువా రెవ్వరు? ఓమహేంద్రాదిదిక్పాలకులారా! ఓయక్షులారా! సిద్ధులారా! సాధ్యులారా! విద్యాధరులారా! కిన్నరులారా! కింపురుషులారా! మీ రందఱు నాకేల సాయము చేయరు? ఏమి నావెఱ్ఱి! యక్షులకు యక్షుఁడు సిద్ధులకు

సిద్ధుఁడు దివ్యులకు దివ్యుఁడు నగుచాదిదేవుఁడాగ్రహించు వీరలా రక్షించువారు. నా దురదృష్టవశమున నందఱకు నామీఁద దయతప్పినట్లే యీకాలచక్రముకూడ వేఱు భంగియైనట్లు కన్పట్టుచున్నది. అట్లుగాకున్న నీప్రొద్దులుపడుగిడనేల? ఓప్రభాకరా! మందభాగ్యుఁడగు నీగంధర్వుఁడు నీకేమియెగ్గుఁగావించె. నీవు నేఁడింత మహావేగమున నేలపొరయెదవు. ఈవఱకే క్షీణమైన నాయాయువును నీశీఘ్రగమనమున మఱింతక్షీణముఁ జేసిననీకేమిలాభము? ఓపూషా! ఓచండకరా! నిజమాడిననిష్ఠురముగనుండునుఁగాని, నాకు నేఁడుగల్గిన మహాపదకు నీవేకారణంబవు. ఎట్లంటివేని; యీదినము ప్రాతఃకాలమున సత్యలోకప్రయాణోన్ముఖుండ నయినప్పుడు ప్రథమమున నీమొగము నే చూచితిని. నీముఖము నాపాలిఁటికి మృత్యుముఖమైనది. మఱియు నందనందనుఁడు నీకర్ఘ్యప్రదానమొనరించుసమయమునందే నన్నుఁ జంపఁ బ్రతిజ్ఞఁబట్టె. ఓహో! నేనెంతమూఢుఁడను. భగవంతుఁడును త్రిమూర్త్యాత్మకుఁడును త్రిలోకోపకారపరాయణుఁడునునగు నీయంతటివాని నిష్కారణంబుగ నిందించుచున్నాఁడను. ఓదేవా! నేనుమందబుద్ధినై నాయభాగ్యదోషంబునకు నీవే హేతువని నోటికివచ్చినట్లు ప్రేలుచుంటిని. భగవానుఁడా! నాదోషము సైరింపుము. ఇదిస్వయంకృతాపరాధముగాని భవత్కృతముగాదు. ఈయాపద నిఁక గడుపఁ బెట్టువారెవ్వరు? ఏలోకమునకుఁ బోయి నేనిప్పుడు డాగియుండుదు? ఈసర్వప్రపంచమున విష్ణువ్యాపనము లేని తావుగలదె?

సీ. పాతాళమున కేగి ♦ బ్రతుకవచ్చు నఁటన్న బలిచక్రవర్తి నంపట్టియిచ్చె
మర్త్యలోకము జేరి ♦ మనవచ్చునన్కొన్న నాలోకమునఁ గృష్ణుఁ ♦ డవతరించె
స్వర్గలోకముఁ జొచ్చి ♦ సౌఖ్య మొందెదనన్న సుత్రాముఁడాతని ♦ సోదరుండె
నక్షత్రపథమున ♦ నక్కియుండెదనన్న భానుమండలమునఁ ♦ బరఁగు నతఁడు
ఆకాశగంగలో ♦ నడఁగియుండెదనన్న నతనిపాదములందె ♦ యది జనించె
జలధి నాఁచుకు వేడి ♦ శరణుఁజొచ్చెదనన్న వటపత్రశాయియై ♦ యటనివసించు
వనభూములందున ♦ వసియించెద నటన్న నగ్ని నమ్రింగు నే ♦ గాపుతిగను
గుహాంతరంబుల డాగి ♦ కొనవచ్చునన్కొన్న సింహరూపము దాల్చి ♦ చెలఁగునతఁడు
తే.గీ. గజచెగ్గలాపసత్యలో ♦ కములయందు, కెంపుబోవుదు?గతియేమి? ♦ యెవఁడుబ్రోచు
బదియు నాలుగు భువనము ♦ ల్వైదకిమాఁడ నేను తలదాఁచుకొనఁదగు ♦ నెలవులేదు.

నాకు సంభవించిన యీవిషమముప్పుకతమున నేనొకనీతిని నేర్చుకొంటిని.

తే. గీ. బల్లిదులదోషములు పొర ♦ పాటు లగును,
దుర్బలుల పొరపాటులు ♦ దోషము లగు,

చేవగలవాని పంతమే ♦ చెల్లుగాని
బలవిహీనుని మాటలు ♦ పాటియగునె.

ఓజగన్నాథా! ఓదేవకీగర్భజలధిరాకాసుధాకరా! ఓభక్తవరద! నాపైనీకింత యేలిక పాదమునకు నానిష్ఠీవనకారణము తగిన కారణముకాదు. పరమనిష్ఠాగరిష్ఠుఁడవై యహంకారునకు నీవొసంగు నర్ఘ్యవిధికి విఘ్నము నొనరించితిని. కావున నీవు నేమకోధస్థానమునై యుండవచ్చు కాని నీవంటివాఁ డది గణింపఁగూడదు. ఏమనిన. చేసిన తప్పొ చిన్నది. మఱియు,

క. ఉగ్రనిష్ఠలు తపములు న
ధ్వరములు తుల్యములె భూత ♦ దయకు నహింసా
పరమోధర్మ" యటంచుం
బరమజ్ఞానులు వచించు ♦ పలుకులు వినవో;

అదియునుంగాక!

మ. అకలంకాత్ముఁ డంచు నెంచక మహోహంకారబుద్ధి న్మహం
సకరత్నాసహారావివాద మిడు న ♦ క్రాజిహ్వఁగేఁబట్టువా
నికిఁ బ్రిత్తాసనకీర్తిమణాదిదనానా ♦ నీకఁబునుం గాచువా
నికి నవ్వోబ్రిచుట భాగ్యమైనయాదెతం ♦ డీ?! దేవకీనందనా!

ఓనారదాదిదివ్యమునివందిత! కరుణారసైకనిధి! మాధవా! నన్నేలవధియించవు? (మూర్ఛిల్లును.)

(అప్పుడు నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

నార—(గానలో, తే గీ. కలహాభోక్తవు కవ్వని ♦ కపులబొఁపుఁడు
నాకు విధియించినను గొన్ని ♦ వాళ్ళమండి
కటికియుపవాసములఁ జేసి ♦ గడపవలెనె
కడుపునిండినజగడము ♦ లల్లుగ వునికి.

ఇప్పుడీ వాసుదేవుండు మణిపురీందుండగు గయుని సంహరింపఁబూనుటచేత నాకుఁ గడుపునిండఁ గూడు కల్గునని కొంతియాస పుట్టుచున్నది. అయిన ప్రతిజ్ఞాబీజముగఁ జేసి యొక్క కలహామహావృక్షమును బెంచి ఫల మనుభవింపవలయు. అది యేచందమున నిర్మింతును? (అని ఆలోచించుచున్నాఁడు.)

గయు—(మూర్ఛ తెలిసి నారదుని జూడకయే) అయ్యో! అనుదర్శనచక్రింబునకు నాకంఠంబు కాఁ జేయ నేల? ఆ రికళతదానవగర్భనిర్భేదమగు నీఖడ్గంబున

మత్కాంతంబు ఖండించుకొనియెద. (అని కత్తిని దూసి) కాదు కాదు. ఆత్మహత్య మహాపాతక కారణంబు. దాని నొనర్చి పుణ్యగతులకుఁ దప్పనేల?

మ. సిరిపాణిగ్రహణోత్సవంబునఁ దన ♦ ర్చెన్ స్వాత్మీయ స్వేద మం
దగ్నమై యెయ్యది యోగి వామనత దై ♦ త్యస్వామిఁ యాచించె న
గ్నజతో నెయ్యది కష్టకాలమున ధ ♦ ర్త్రశ్రేణి చేయాఁత యా
హరిహస్తంబునఁ జచ్చి యట్టి యసహుఁ ♦ బవ్వారిగాఁ గాంచెదన్.

నార — (తనలో) ఆ! స్ఫురించినది. స్ఫురించినది. కృష్ణార్జునులు అనన్యసామాన్య మైత్రిగలిగి వర్ధిల్లుచున్నారు. వారికిఁ బోరాటంబు పెట్టుటకిది మంచియదను. పెట్టిన నట్టి జగడమే పెట్టవలయును. ఇంచుఁ గృతకృత్యుండనైతి నేని యాదవ, పాండవ, కౌరవవంశ సముద్రంబులు మహాక్షోభంబుఁ బొందును. అంతకన్నను గావలసిన దేమున్నది! నాసృజియింపఁబోవు కలహపరిపాకమును దలఁచ నానోట నూ రూరుచున్నది. సత్వరము తత్ప్రయత్నములఁ జేసెద. (అని గయునితోఁ బ్రకాశముగా) గంధర్వా! ఊరడిల్లుము మూరడిల్లుము.

గయు — (ఆశ్చర్యముతో) మునీంద్రా! ఇదె యభివాద మొనర్చుచున్నాఁడ. మీరాక నన్ను శోకసాగరమునుండి దరిఁజేర్పఁ దెప్ప యని నాకు ధైర్యము కలుగుచున్నది.

నార — దీర్ఘాయురస్తు. గయుఁడా! నీవంత భయపడవలసినది లేదు.

గయు — మహాత్మా! దుర్మదాంధదానవగంధసింధురకంఠీరవుం డగు వా వరకంఠీరవుండు నన్నుఁ మదమట్టింపఁ బ్రతినఁ బూన నాకు దీర్ఘాయువు వెట్లుగలుగును! నన్నూరడించుటకో, పరిహసించుటకో, యిట్లాశీర్వదించితిరని నేఁ దలంచెద.

నార — ఓహో! ఎంత వెఱ్ఱివి! నిన్నుఁ బరిహసింతునా? నావి యూరడింపులు గావు. దీవనలు: నీదుర్గతిఁ జూచి జాలినొంది యుపాయసాహాయ్యంబు నీకుఁ జేయవచ్చితిని. నీరక్షణకు నిరపాయంబైన యుపాయంబు కలదు. నాయుపదేశము నీ వనుసరింతువేని చెప్పెద.

గయు — అనఘా! మునీంద్రా! మరణంబుకంటె నిరపాయోపాయమేమి కలదు? అయినను హితోపదేశముఁ జేయుదుమనియు నయ్యది యాపదనుండి యుద్ధరించుననియు శ్రవణానందముగా మీరు పల్కుటచే మనంబున మరల జీవితకోరికలు తలయెత్తుచున్నవి. కావున మీయుపదేశంబు విన నామనంబు తత్తరపడుచున్నది.

నార — గయుఁడా! ఈవిపత్సమయంబున భవదార్తి హరింపగల మహాపురుషుఁ డొక్కఁడు కలఁడు. అతం డార్తావనదీక్షాపరతంత్రుండును, శూరశిఖామణియు గా

నార — ఓయీ! ఆతెఱఁ గెఱింగించెద నాకర్ణింపుము.

ఉ. ద్వైతవనంబుఁ జొచ్చి యల • పాండవు లుండెడిచో టెఱింగి, వి
ఖ్యాతుని శక్రనందనుని • నర్జునుఁ జూచి నమస్కరించి ముం
దాతనితోదుత స్వగత • మంచును బల్కి యనంతరంబునన్
నీ తెఱఁ గంతయుం దెలుపు • నీరజనాభు కృతప్రతిజ్ఞలన్.

అట్లొనర్చెదవేని నీప్రాణంబులు నీకుఁదక్కును.

గయు — దేవా! ప్రతిజ్ఞ చెడినను ఫలము దక్కవలయుఁగదా; నేను వాని వేఁడుదును గాని నన్నుఁ గాచుట కాతనికి సామర్థ్యముకలదా? కొండలు లేని వస్త్రల నఖియనయించి కార్యముఁ జెరతురు.

నార — ఓయీ! మూఢుఁడా! మధ్యమపాండవుని విక్రమం బెన్నఁడును విని యెఱుంగవా?

తే. గీ. పశుపతిని గెల్చె ఖాండవ • వనముఁ గాల్చె
జక్కుల నదల్చె మత్స్యగా • ఋషులఁ గాచె
నంతవానికి నిను గాచు • టెంత నేఁడు?
గీల గుడి మ్రింగువానికి • లింగ మెంత?

గయు — అట్లయిన మీహితోపదేశము శిరసావహించి యిప్పుడే ద్వైతవనము నకుఁ బోయెద. మీయంతఃకరణశుద్ధి యెఱుఁగక నాపలికిన యనుచితవాక్యములకు నన్ను మన్నింపుఁడు, ఇదె నమస్కరించుచున్నాఁడ.

నార — దీర్ఘాయుష్యమస్తు! గయుఁడా! మున్నవలకేమి గాని నేఁజెప్పినవిధము మఱవకుము. ఫాల్గునుఁగనినతోడనే శరణు శరణనవలయుఁజుమీ? కానిచోఁ గార్యము చెడును. ఇంక నే నరిగెద.

(ముందుకు నడచి తనలో)

తే. గీ. కడిమి నర్జునుంబు నిడకపో • వఁదు శరీరి
ప్రతిన చెల్లించుకొనకపో • వఁదు మురారి
వాం కటమీద గాకపో • వదు రణంబు
నిరుపమానందవార్ధి • నేను దేల.

(నిష్క్రమించుచున్నాఁడు.)

గయు — (తనలో) ఈపటి కాపితామహమహేశ్వరతిరస్కారంబులును నారద హితోపదేశంబును నైనవి. ఇఁక నాపాండవమధ్యముని వేఁడవలయును. ద్వైతవనంబుఁ బ్రవేశించుటకుఁ జక్రనిహతుండను గాకుండ నేను జీవించి యుందునా? ఉండనిచోఁ



శ్రీ

ప్రచండయాదవనాటకము.

అను

# గయోపాఖ్యానము.

## తృతీయాంకము.

రంగము: ద్వైతవనమునందొక యాశ్రమము.

(అంతట విషాదముతో నర్జునుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

అర్జు—(తనలో)

చ. కడచునె యెన్నఁడైనఁ జిర ♦ కాలమునుండియుఁ దీఱకున్న యీ
యడవుల సంచరించు వెత ? ♦ యాఱునె నాఁటిపరాభవాగ్ని మా
యెడదల నెన్నఁడేని ? యిఁక ♦ నెన్నటికేనియు రాజ్యలక్ష్మి చే
పడునొకొ మాయుధిష్ఠిరనృ ♦ పాలునకున్ యుగమందఁ బందుగుల్ !

ఎన్నఁడింద్రప్రస్థము నేలితిమో, యెన్నఁడు రాజసూయ మొనర్చితిమో, యెన్నఁడు మహావైభవంబున విలసిల్లితిమో, ఆకథ లెల్ల స్వప్నగతవృత్తాంతము లట్లున్నవి. జగజ్జేగీయమాన ప్రతాపవంతుల మగు మేము కౌరవులచేత నిష్కారణముగా వంచింపంబడి కడలేని యిడుములఁ గుడువవలసివచ్చెఁగదా యని చింతించుచున్నను గొండొక కారణంబున మేము సంతసింపవలసియున్నది. ఏమన.

సీ. ఫాలనేత్రుని గెల్చి ♦ పాశుపతముఁ గొంటి కాంతారవాసంబు ♦ కతనఁ గాదె
కాలకేయులఁదోలి ♦ భువకీర్తిఁ గాంచుట కాంతారవాసంబు ♦ కతనఁ గాదె
యమరనాయకుని య ♦ ర్ధాసనం బెక్కుట కాంతారవాసంబు ♦ కతనఁ గాదె
కౌరవేంద్రుని గావ ♦ గంధర్వుఁ గెల్చుట కాంతారవాసంబు ♦ కతనఁ గాదె
తమ్మిచూలికి నెనవచ్చు ♦ తాపసులను గనుట కాంతారవాసంబు ♦ కతనఁ గాదె
ధార్తరాష్ట్రులు మాకగ్గఁ ♦ దలఁచుకొన్న కీడులో మేలు మాకొన ♦ గూడెనిందు.

ఈపాశుపతాది మహాస్త్రలాభమునకు హృదయమున నభిలషించుచు దాయలొనర్చిన యపకారంబునకుఁ జింతించుచు నుండ గొండొక కాలఁ గనకైన వనవాసక్లేశంబు దొలంగ కుండునే! [తెరలో]

తే. గీ. ఉదయ మారంభముగ మృగ • యోత్సవంబు
ప్రీతి నెఱపితిమిగద ! • రాజులార !
మట్టమధ్యాహ్న మయ్యె ని • ప్పట్టున నిఁక
వేఁట చాలించి యిండ్లకు • వేగఁ బోందు.

అర్జు—(ఆలకించి) అదిగో! ప్రాతఃకాలారంభముగ మృగయావినోదాగ్రహము గహనాంతరంబున సంచరించి వేఁటకాండ్రకు సెలవిచ్చుచు సహదేవుం డిటవచ్చుచున్నాఁడు. కాని యీ సుకుమారుం డధికాయాసముఁ జెందినట్లు దోఁచుచున్నయది.

[అప్పుడు సహదేవుండు "ఉదయమారంభ" మనుపద్యమును జదువుచు ప్రవేశించుచున్నాఁడు]

సహ—(తనలో) ఈవేఁటవలన రెండుపనులు సమకూడినవి. మాకాహారంబునకు గావలసిన నంజుళ్ళు లభించుటయేగాక సాధుజనంబులకును సంయములకును బాధలు కలిగించు క్రూరసత్వంబులు వధియింపఁబడినవి. (అనిచూచి) మాసహోదరుఁ డగ్రజుఁ డిచ్చటనే యున్నవాఁడు; ఈదినమున నితఁ డేమి కారణంబుననో వేఁట కరుగలేదు. (అని అర్జునునియొద్దకుఁ బోయి) అన్నయ్యా! మీరొక్కరే యున్నారేమి!

అర్జు—తమ్ముఁడా! నాయొడలికి కేమిగాని నీవిటు కూరుచుండుము.

తే. గీ. గాటు సుకుమారంబున నీమోము • గమ్మనందు
పొడము వేనవేల్ చెమ్మట • బొల్చుచూడ
భానుఁడు సహస్రకిరణముల్ • బర్వఁ జేసి
నిన్ను నలయించె ననితోఁచు • నిశ్చయముగ.

సహదేవా! మునీంద్రులు తమతమ జపతపంబుల మాని పర్ణశాలల కరుగుచున్నవారు. క్రూరమృగంబులు సయిత మెండవేఁడిమికోర్వక మహీరుహచ్ఛాయలకుం బఱతెంచుచున్నయవి. ఇంత తడవేల చేసితివన్నా!

సహ—అన్నయ్యా! ఉత్తరోత్తరనిష్ఠుర మగు నీవనవాసక్లేశ మొక్కనాఁటిది కాదుగదా! మీకుఁ దమ్మునిపైఁ గల గాఢానురాగంబు వెంపున జాలినొంది యిట్లని యెందఱుగాని యిది యనుభవింపక తప్పునా? అయినను మనకష్టము లిప్పుడు, మొట్ట మొదటనుండినంత దుస్సహములుగా లేవు.

అర్జు—ఓయీ! నీవజనావనదీక్షావ్రతంబుఁ దగునీయగ్ని దిక్ప్రాకార నిశాకరాదిగ్రహంబులు ధూమ్యాకాశాదిపంచభూతములు సాక్షులుగా నీకభయప్రదానము చేసె. ఎవ్వరు వచ్చి నిన్ను విడువుమన్న విడువను. భయపడకుము. కూర్చుండుము. (అని మీఁద చేయివైచి తట్టుచున్నాఁడు.)

గయుఁ—(తనలో) అమ్మయ్యా! నాప్రాణంబు లిప్పటికి కుదురుపడినవి.

సహా—(తనలో) ఈతనికభయప్రదాన మొసఁగుట యుక్తమే గాని ఈ పురుషుం డెవఁడో యీతని కేమి కారణంబున నెవరితో వైరము గలిగెనో యూరక ముందుగా మాయన్నగారు శరణ మొసంగిరి (ప్రకాశముగా) అన్నయ్యా! అతఁ డెవ్వరో యడుగుదమా!

అర్జు—తమ్ముఁడా! మహాభీతచేతస్కుఁడైనవానికి భయముఁదీర్చి తదనంతర మాతని చరిత్రమడుగుట ధర్మము గావున నాతఁడు కొంచెము తడవు విశ్రమించిన వెనుక నడిగెదము.

గయు—(తనలో) ఆహా! కృష్ణుఁడు ప్రతిన చేసినది మొదలిప్పటివఱకు నింతశ్రవణానందకరమైనమాట వినఁబడదయ్యె. ఇఁక బ్రతికితిని. ఆనారదుండు నాకు మహోపకార మొనర్చె. ఆతనిమేలు మఱవఁజాల. కాని యీ పాండవవీరుఁడభయదానము చేసె, రక్షింపఁగలఁడా లేఁడా యని శంకించుచున్నాఁడను. ఏలయన నుపకారముఁ జేయఁగోరియుఁ జేయనివాఁడును, చేయఁజాలక యాడంబరమాత్రమునఁ జేయఁగలనని నటించువాఁడును సమానముగా నిర్గుణులు. ఇతఁ డట్టివాఁడని తోఁచదు.

అర్జు—అయ్యా! నీవిప్పుడు శ్రమములేక చెప్పనోపుదువేని చెప్పుము. నీ వెవ్వఁడవు? నీ ప్రాణాపహరణప్రతిజ్ఞఁ జేకొన్నవారెవ్వరు?

గయు—నేనా! (అని సందేహించుచున్నాఁడు.)

సహా—(తనలో) ఈతఁడేమికతమునను తనవృత్తాంతముఁ జెప్ప నిష్టములేక నాసహోదరప్రశ్నమునకు నుత్తరమీయ శంకించుచున్నాఁడు; కారణ మేమైయుండును.

అర్జు—ఓయీ! సందేహమేల? ఇంకను భయవర్జితుఁడవు గాలేదా? చెప్పు! భయములేదు.

గయు—నేను హిమశైలమున నున్న మణిపురమేలు గంధర్వరాజను; గయుఁ డనువాఁడ. ఈదినమున—

అర్జు—అయ్యా! గంధర్వసార్వభౌముండవగు నిన్ను సాధారణపురుషునిగా భావించితిని; క్షమింపుము, ఇప్పుడు నీకు భయకారణ మేమి?

గయు—అయ్యా! ఈదినమునఁ బ్రాతఃకాలమున బ్రహ్మలోకావలోకనకుతూహలినయి గగనమార్గంబున నరుగుచు నిష్ఠీవనంబు పొరపాటున నేలవైచితిని.

సహ—అదియెవ్వరిమీఁద నైనఁబడెనాయేమి? అయినను పొరపాటుగదా?

అర్జు—అమరదర్శనలాలసుఁడ వగుట నిరతిశయధన్యుఁడవు. తరువాత నేమిజరిగినది?

గయు—నావిడిచిన నిష్ఠీవనంబు ప్రభాకరున కర్ఘ్యప్రదాన మొసఁగుచున్న కృష్ణుని హస్తాంజలిం బడియె. అతండు నన్ను వధియింపఁ బ్రతినబూనె.

అర్జు—(ఆశ్చర్యముతో) అనిర్వాచ్యప్రభావుఁ డగు నా మహానుభావుని హస్తంబులనే యుమిసితివిగా! ఎంతపని జేసితివి!

సహ—అర్ఘ్యప్రదాన మొసఁగునప్పుడే? ఇది యతనికిఁ గోపకారణమే.

గయు—(తనలో) ఈయిద్దఱును నన్ను విడుతురా యేమి?

అర్జు—గయుఁడా! ఆమాట మొదట నేల నుడువవైతివి. నిరంకుశప్రతాపుఁ డగు నాతనియెడ నీవపచార మొనర్చుటయు నతఁడు ప్రతినఁ దాల్చుటయు నిను రక్షించుటయు నా?

గయు—మొదటనే తెలిపినచో మీరు నాకు శరణ మగుదురా!

సహ—ఎంతయు మోసమువాటిల్లె? ఈ వైపరీత్యముకతమ్మున యాదవపాండవ కులసముద్రములు ఘూర్ణిల్లు. అన్నయ్యా! యిప్పుడు కర్తవ్యమేమి?

అర్జు—అయ్యో! కుడిచి కూర్చుండి యనురాగాతితో నకారణవైరంబుఁ దెచ్చుకొంటి. గాండీవాదిమహాదివ్యాయుధసంప్రాప్తి కతనికటాక్షమే కారణముగదా! గాంధారేయనిర్మితములగు మహోపద్రవసముద్రములనుండి బయలుపడుట కా వాసుదేవుని కరుణయే కదా! కారణము. అట్టి పాండవక్షేమంకరుఁ డగు యదుకుంజరునితో వైర మెట్లుతప్పించుకొందు. అయ్యో! శ్రీకృష్ణుఁడు పరమశత్రుఁ డని పొరపాటున నింతకుముందే సహదేవునితోఁ బలికితిని. అదినిశ్చయముగా సంప్రాప్తమయ్యెనే! ఏది దారి? శరణాగతరక్షణబిరుదాంకుఁడ నయ్యు నీతని విడిచితినా సకలమహీనాయకులలో నప్రతిష్ఠ గలుగక మానదు. విడువకుండినచో స్వప్నావస్థయందైనను తలఁపని వైరమా శ్రీకాంతునితోఁ గలుగును. తమ్ముఁడా సహదేవ! నీవు బాలుఁడవయ్యు బుద్ధిని బృహస్పతిప్రతిమానుఁడవు, కావున కర్తవ్యము నీవే యూహింపుము?

గయు—మహాత్ములారా! రక్షించుటకంటె గర్తవ్యాతిశయము లేదు. అన్యథా యూహించి యీదీనుని విడువవలదు.

సహ—అన్నయ్యా! ఈయల్పాంశంబునకై యింత చింతిల్లనేల? ఈతఁడు పొరపాటుచే నొనర్చెనని యెఱుంగక యాదవేంద్రుఁ డిబ్భంగిఁ బ్రతిజ్ఞ నొనర్చె, పొరపాటని యెఱింగినచో నీతని క్షమియించి విడుచును.

గయు—మహాత్మా! చంపఁ జక్రము విడుచునుగాని నన్ను విడువఁడు.

అర్జు—అట్లామహానీయుఁడు క్షమింపనిచో—

సహ—క్షమియింపనిచో గయుని సమయించుటయే.

అర్జు—(కోపముతో) తమ్ముఁడా! ఫాలనేత్రుని నెక్కటికయ్యమున నిర్జించిన నన్ను శరణు వేఁడియు గయుఁడు సమయింపఁబడునే కూఁడదు.

మ. నిటలాక్షుండిక్క డెత్తివచ్చినను గా ♦ నీ; యన్న దమ్ముల్ననున్
న్విటతాటంబుగఁ బాసిపోయినను బో ♦ నీ; కృష్ణుఁడేవచ్చి య
ద్దిటు పార్థా యననీ, మఱేమయినఁ గా ♦ నీ లోకము ల్పగ్గిలం
బటుదర్పంబున నిల్చి యీగయుని ప్రా ♦ ణం బేనుఁ గల్పించెదన్.

సహ—అట్లైన నీధర్మసందేహంబు మన యుధిష్ఠిరమహారాజుగారే తీర్చ వలయును.

అర్జు—ఎల్లప్పుడు మన కేడుగడయగు గోవిందుఁ డేయని నమ్మికొన్న యామహారాజుమాట విని వ్యాకులచిత్తుఁ డగును.

గయు—ఆయుధిష్ఠిరుఁ డీయంశంబున కంతరాయ ముపదేశించునేమో కదా!

[అప్పుడు యుధిష్ఠిరుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

యుధి—కారణమేమి చెప్పుమా.

శా. ప్రాతఃకాలమునందు లేచి వెస నీ ♦ ర్వర్తించి కాల్యంబులం
బ్రీతి న్నాకు నమస్కరించి చని గా ♦ భీమంబు మాద్రేయు లా
గీతి న్వేటకు వాతపంబుబలమై ♦ పృథ్వీస్థలిన్ గాల్పెడిన్
వాత్మల్ వనుదేరలేమికతమో ♦ మధ్యాహ్నమై యుండినన్.

మఱియు నీయరణ్యమందుఁగల

ఉ. అసమమహాతపంబువడ ♦ యూసఁగ లేమిని చెట్లనీడలన్
వినువున నిల్చిరో విపిన ♦ వీథులయందతిగూన మేఁగరో
మసలిరో కావితావులను ♦ మార్గ మెఱుంగక యిందు నందు నా
క్రొసపడుచున్నవారో యని ♦ గాఢవిషాదము పుట్టె నెమ్మదిన్.

మాయగ్రజుఁడీదినమున మృగయాక్రీడ కరుగలేదు (వచ్చుచున్నాఁడు.)

అర్జు—అన్నగా రదిగో నిటువచ్చుచున్నారు.

గయు—అమహారాజేమి యనునో!

యుధి—(తనలో) అదిగో నర్జునసహదేవులచ్చోట నున్నవారు. వేటకై యరిగిన సహదేవుఁ డరుదెంచె. భీమనకులులు రాలేదు. ఈపార్థునివదన మతిదీన

ముగా నున్నది. సహదేవుఁడు సయితము చింతాక్రాంతచిత్తుఁడై యున్నవాఁడు. ఈ క్రొత్తపురుషుఁ డెవ్వఁడు చెపుమా! (ప్రకాశముగా) అర్జునా! నీవదనసుధాకరబింబ మింతకళావిహీనమయినదేమి? సహదేవా! ఆమహాపురుషుఁ డెవ్వఁడు! అర్జునుని విచార కారణమేమి?

గయు—మహాత్మా! నిషధాచలేంద్రవాసుఁడను. మణిపురాధినాథుఁడను. శరణా పాండవాగ్రజా!

యుధి—తమ్ముఁడా! నాఁడు వరాహార్థమయ్యంబికానాథునితో సమరంబొనర్చు నప్పుడైనను నివాతకవచకాలకేయాది మహాదానవవీరుల దండించునప్పుడైనను ఖాండ వంబు హుతాశనార్పణము సేయునాఁడైనను మనోవికారం భీషణాకృతింబైన నెఱుంగని నీకు నేఁడింత చింతయేల?

సహ—అన్నయ్యా! ఈగయాఖ్యగంధర్వప్రభుండు మాధవహస్తాంజలి యందు నిష్ఠీవనంబువైచె. అందుచే జగన్నాథుఁ డాగ్రహించె.

యుధి—(ఆశ్చర్యముతో) నిష్ఠీవనంబు వైచెనా? అట్లయిన విచార హేతువే?

గయు—ధర్మనందనా! ధర్మరహస్యవేదీ! నీవు ధర్మంబు వీడవలదు.

అర్జు—అన్నయ్యా! విపులసభాంతరాళమున గౌరవులు పాంచాలీవస్త్రాప హరణంబు సల్పుచుండ మనల గటాక్షవీక్షణంబుల రక్షించినట్టియుఁ జిన్నతనము మొదలు మనల బ్రోచినట్టియు శ్రీకృష్ణబలరాములతో నేఁడు నిష్కారణవైరంబు సంభవ బయ్యె నని మీతో నెట్లు చెప్పుదును!

యుధి—హా! తమ్ముఁడా! వైరమా! శ్రీకృష్ణునితోడనే? యేల?

సహ—అన్నయ్యా! అకారణంబున మాధవుండు నీ గయునిఁ జంపఁదలఁచి శరణాగతుండైన గయున కర్జునుఁడభయ మొసఁగె. తదనంతరం బాకథావిధానం బరసి చింతించుచుండె.

యుధి—అయ్యో! సోదరులారా! అలోకైకపూజ్యునితో నిర్హేతుకవివాదంబు సంప్రాప్తమైనదా? అయ్యో! కురుధాత్రీవల్లభుఁడు కపటద్యూతపరాజితులఁ జేసినను గులకాంతారత్నంబును సకలధాత్రీనాథసన్నిధానంబున నవమానించినను నిరంతరశోకదాయక మహాపూజ్యసామ్రాజ్యంబు గోలుపోయినను జననీజనకతనయ వనితాది బాంధవ సమూహంబు దూరమైనను, క్రూరమృగానీకభీకరారణ్యభూముల సంచరించుచున్నను దుర్యోధనపక్షపాతిబుద్ధిని సమస్తబాంధవులు మనల దిగనాడినను నాజగద్రక్షకుండగు సర్వోత్తముని కరుణాకటాక్ష ముండినమాత్రము చాలునను కొంటి. నాభాగ్యదోషంబున నాజగత్త్రాణుండు సయితము శత్రుఁడయ్యెఁగదా.

ఇంక మాధవ విరోధితంబై నిష్ప్రయోజనంబై రాజ్యభోగవిహీనంబై కాంతారవాస యోగ్యంబైన యీదేహంబు విడిచి యరణ్యసీమలయందు వసియించినను జచ్చినను నొక్కటే.

మ. కురురాజాగ్రుల నెన్ని చేసినను నై ♦ కుంఠేయుఁడై నట్టి యా
సరసీజాక్షుకటాక్ష మున్నదిగదా! ♦ చాలింక లోకంబు నా
కరయ న్లేదనుకొంటి గాని యిటు లో ♦ నం జెంచఁగలేనైతి నీ
పరి నా మాధవు ప్రీతి వోయెఁగద నా ♦ జన్మంబిఁకం గాల్పనే?

అర్జు—అన్నయ్యా! రాజన్యవంశజుండ నగుటచే శరణాగతుండగునట్టి యీ పురుషునికి శరణ మొసంగితిని. తదన్య మెఱుఁగను

గయు—ఓ యుధిష్ఠిరమహారాజా! మహాధర్మస్వరూపుఁడై సంక్రందననందనుఁడు రక్షించె. మీరు తద్విఘ్నం బాచరింపవలదు.

సహ—అన్నయ్యా! దానికై చింతించిన ప్రయోజన మేమి? మన భీమసేనుండును నకులుండును వచ్చినపిదప నాచరణీయం బూహింతము.

యుధి—తమ్ముఁడా! విచారించినఁ బ్రయోజనము లేదు; కాని—

తే. గీ. దైవమును సద్గురుండును ♦ దల్లిదండ్రి
చుట్టమును నెయ్య మాధవు ♦ నూవనుండె
యనుచు నెఱనమ్మికొన్న నా ♦ హరియె నేఁడు
పగతుఁ డగునంచు వలదని ♦ ప్రబలె మదిని.

అర్జునా! అయిన నేమి? తద్విషయమై విచారింపకుము. భీమసేనుండు వచ్చిన పిదప కర్తవ్య మూహింతము. సహదేవా! నీవుపోయి యీవృత్తాంత మెఱింగించి నకుల భీమసేనులను నిటు దోడికొనిరమ్ము.

సహ—చిత్తము (అని నిష్క్రమించును.)

యుధి—అర్జునా! మన మొనర్చునది ధర్మకార్యమయినను, నా మనసు కృష్ణుని తోడి పగ నొల్లకున్నయది.

సీ. కాల్పించెఁగద యింద్ర ♦ ఖాండవారణ్యంబు, వేలుపు లెదలోన ♦ వెఱఁగుపడఁగ
నిర్మించెఁ గద నాకు ♦ నెనలేనిమణిసభ నృపకోటి కల్లఁ గ ♦ న్నెఱ్ఱగాఁగఁ
జేయించెఁ గద రాజ ♦ సూయంబు నాచేత, మనకీర్తి దెసలందు ♦ మలసియాడ
రక్షించెఁ గద కౌక ♦ లక్షయంబుగఁ జేసి, పాంచాలి బన్నంబుఁ ♦ బడయకుండ
మిఁగులఁగూర్చెడు చెలికాఁడు ♦ మేనమఱఁదిచేయు మన్నాఁడు చేసెను చేయఁగలఁడు

మనకు నుపకారముల నెన్నో • మాధవుండు ఆతనితో వైరమునకెట్లులనుమతింతు!

అర్జు—అన్నయ్యా! నకులభీమసేనులఁ దోడ్కొని సహదేవుం డిదే వచ్చుచున్నాఁడు.

[అప్పుడు భీమ, నకుల, సహదేవులు, ప్రవేశించుచున్నారు]

భీము—సహదేవా! గయుని కర్జునుఁడు శరణమిచ్చుట యన్నగారి కొక్కరికే సంతాపహేతువు గాదు చూడు.

ఉ. గంధగజేంద్రతుల్యబల • గర్వతృణీకృతశాత్రవున్ జరా
సంధు నెదుర్చు వాఁడును వి • షాద మెఱుంగ నొకించుకేని ద
ర్పాంధులు కౌరవుల్ పనికి • నంపినవాఁడును నుండఁగాని స
ద్బంధుఁడు కృష్ణుఁ డిప్డు పగ • వాఁ డగునంచును గుందెదన్ మదిన్.

నకుల—అవును. తే. గీ. మహిత కార్యగతులు దెల్ప • మంత్రి యగుచు
శుభము లొనగూర్చు గారాబు • చుట్ట మగుచు
నాపదలయందుఁ బాయని • యాప్తుఁ డగుచుఁ
జెలఁగు హరి డాయ యగుటన్నఁ • జింత గాదె!

సహ—అందుచేతనే మనయన్నగారు కార్యనిశ్చయము మీరు వచ్చినపిమ్మటఁ జేయఁ గడఁగిరి.

యుధి—తమ్ములారా! యిటువచ్చి కూర్చుండుఁడు. (అందఱు కూర్చుండిరి)

భీముఁడు—(తనలో) కటకటా!

తే. గీ. తొల్లి కురుకుమారులు సేయు • దుండగముల
రాణసెడినట్టి యీమహా • రాజు మనసు
పిడుగువోలిన యీమాట • వినినపిదప
నెంత నొచ్చెనో యామొగం • బెఱుఁగఁజేయు.

భీముఁడు—(తనలో) అధికారినిఁ జూచిన దొంగవలెనే గజగజ వడంకెడు నీ పురుషుఁడే గయుఁడని తోఁచుచున్నది. (ప్రకాశముగా) అన్నయ్యా! నీకు నాలుగు భుజములవలె తమ్ములు నలువురు పనులు సేయుచుండ నీ వింతవంతఁ జెందనేల? అర్జునా! నీవు రాజధర్మము నతిక్రమించలేదు, గావున విచారింప నక్కఱలేదు.

అర్జు—సహోదరులారా!

తే, గీ. నిరుపమక్షాత్ర మనియెడు • నెపముచేత
బాల్యమునుండి నా బహు • ప్రాణమైన

దేవకీపుత్రుతోఁ బగ • దెచ్చికొంటిఁ
గోరి చేకొని తలఁ గొఱవి • గొనినయట్లు.

ఇందు గర్తవ్య మిప్పుడు మీరు నా కుపదేశింపవలయును.

నకులు—మహారాజాగారి నిర్ణయమునకే మనము బద్ధుల మైయుండుదము.

యుధి—తమ్ముఁడా! భీమసేనా!

ఉ. శ్రీమమునఁ గౌరవాధములు • కల్పనసేయు ప్రపద్రవప్రవా
హములఁ గట్టురీతి నను • గాంతకుఁ దద్దము నిల్చెఁదొల్లి యా
సమయమునందునో మనకుఁ • జక్రికి వైరము గల్గఁ దప్పివా
హమునకు వద్దులేదు పెర • లెంగఁగ లేరికఁ జెప్పఁజాలమిన్.

భీముఁడు—అన్నయ్యా! నిజకరవాలనిహతవిమతశ్రీదూరీకృతశాత్రవుం డగు పాండుధరాశేఖరుని పుత్రులమై సకలాహవవిజయసాధనచాతుర్యయుక్తులమై యుత్తమక్షత్రియప్రవరాన్వయసంజాతుల మైనమన మీవిధంబున విచారింపఁదగదు. మనయర్జునుఁడు ధర్మవిరుద్ధ మైనకార్యముఁ జేయలేదు.

అర్జు—మనభీమసేనునిపలుకులు సమాదరణీయములు. అగోవిందుఁడు గయుని రక్షించి నన్నొకదరిఁ జేర్పకపోఁడు. కావున వెఱవ వలదు.

యుధి—తమ్ములారా! ప్రాణబంధుఁడు సగతుఁ డగునేమో యని విచారించు చుంటిని గాని, వెఱచుటలేదు.

భీము—అన్నయ్యా! అశేషలోకశోభితోదరకుహరుండై, వేదవేదాంగశాస్త్ర పరిజ్ఞాతయైన యాకృష్ణుఁ డది గయుని పొరపా టని యెఱుఁగఁడా?

గయు—మహాత్మా! తప్పక పొరపాటె సందేహములేదు.

సహ—ఎఱుఁగునో యెఱుఁగఁడో మన మెట్లు చెప్పఁగలము?

నకు—ఎఱిఁగినచో నిక్కేల ప్రతిన సేయును!

అర్జు—దుర్వారపరాభవజనితక్రోధంబున నిట్లనియుండవచ్చును.

భీము—అట్లెఱిఁగియు నిట్లసమానప్రతిజ్ఞాభినివేశ సమన్వితుఁడౌట న్యాయమే? అదియునుఁగాక; శ్రీదేవకీనందన కృతబహుళోపకారముల చేతను, దద్దయు వెఱుమోటమి చేతను పార్థజనరక్షణము వర్జించితిమేని, సకలరాజప్రపంచమధ్యంబున నపహాసితు లముగామా? పాండురాజనందను లనంత దర్పోన్నతు లనుజగత్ప్రసిద్ధవాక్యం బసత్యం బుగాదె! కావున గయుని విడువవలదని నాయభిప్రాయము.

యుధి—అమాట నిశ్చితంబు; గయునిరక్షణంబవశ్యకర్తవ్యంబు.

నకు—అది నాకు సమ్మతము.

సహ—ఇది నాకు నంగీకారమే.

అర్జు—ఓసహోదరులారా! ఆర్తత్రాణము నృపకుమారుల కాచరణీయ మగుటచే నీగయునకు శరణ మొసంగితిని. అందులకు మీరుత్సాహకరవాక్యంబులంబల్కి నాయులమటఁ దీర్చితిరి.

గయు—మహాత్ములారా! పాండునందనులారా! మీసహోదరపంచకంబునకుఁ బంచసహస్రవందనములు.

(తెరలో)

అయ్యా! పాండవులెందున్నవారు? ఏమి; అశ్వత్థముక్రింద నున్నారా? సరే.

యుధి—సహదేవా! వారెవ్వరో కనుఁగొని రమ్ము.

అర్జు—అదిగో! నారాయణపదసేవాపరాయణుం డగు నక్రూరుఁడే యిట వచ్చుచున్నాఁడు.

గయు—(తనలో) అతఁ డామాధవునిచేతఁ బంపఁ బడలేదుగదా!

[అప్పుడు అక్రూరుఁడు ప్రవేశించుచున్నాఁడు]

అక్రూ—(తనలో) ఆహాహా! కాల మెట్టిమార్పులఁ దెచ్చును!

ఉ. వన్నియ దెచ్చుచు స్థలము ♦ వాగలకు స్థనిపెందు కుంతికిన్
బుస్సిమురఁ బుత్తై తనరి ♦ పూచిన తంగెడు లట్లు శోభమై
నన్నలరాలకోడలను ♦ హాయిగ నుండఁగఁ జూచినట్టి యా
కన్నులజూడఁగావలసెఁ గానల నుండఁగఁ బాండవేయులన్.

(ప్రకాశముగా) యుధిష్ఠిరా! జయమగుఁగాక! జయమగుఁగాక!

అర్జు—అక్రూరుఁడా! బలసాత్యకి సమేతంబుగా వాసుదేవునకు క్షేమమే?

యుధి—చ. అగణిత సత్వశాలి యగు ♦ నాబలభద్రునకు సుఖంబె? యు
గ్రాగచువిదుంబా కృష్ణునకు ♦ నిత్యము మంగళమే? సుఖంబె వ
ర్గాగుణజాలి? యాదవుల ♦ పౌరసుఖంబున నున్నవారొకో
మగువలుపిన్నవాండ్రు మతి ♦ మా ప్రియబంధులు సౌఖ్యశీలురే!

అక్రూ—ఆ. అందఱు నేమంబున నున్నవారు.

యుధి—ఉభయపార్శ్వముల సాత్యకి బలరాములు తన్నుంగొలువ సుధర్మా సభ్యాంతరంబున నెంచేసియుండు యదుకులకమలాకరప్రభాకరుఁడగు మామిత్రుఁడయిన దలపెట్టునే? వనవాసులగు నేతోధనులు తనకడ కరుదెంచునపుడు మమ్ముఁదలఁచి యడుగునే!

అక్రూ—రాజా! నీవ దేల యడుగనేల? విను!

గయుఁడు—(తనలో) అయ్యో! దైవమా! నీవు నన్నిప్పుడు కృష్ణునకప్పగింపఁగోరా రేమి!

యుధి—(తనలో) అనుకొన్నట్లయినది. అతఁ డీదినమున దిట్టముగా బట్టు పట్టియున్నాఁడు.

భీమ—అన్నయ్యా! సందేహాయత్తచిత్తులై యిత్తెఱంగునఁ జింతిల్లనేల? యథోచితోత్తరముల నీరాయబారిని బంపుఁడు.

యుధి—అనుజుఁడా! వాసుదేవునకు మాయెడఁగల యమితానురాగమునకు మేము కృతజ్ఞుల మగుచున్నాము. అతనితో మాకు వైరకారణము లేదు. గయుని నిష్ఠీవనం బాతని హస్తాంజలింబడుటయు నాతం డసాధారణప్రతిజ్ఞలఁ బూనుటయు దెలియఁగ మాయర్జునుఁడు, గయుఁడు భయవిహ్వలుఁడై తనకాళ్ళఁబడి వేఁడ జాలి పెంపున వానిం గావ గంకణముకట్టె.

భీమ—అవ్వశుత్తమరాజవంశసంజాతుఁడగు వాఁడు శరణు నొసంగకుండఁ గలఁడా? అనాథవృందమునకు మాత్రి మట్లొసంగఁడేమి?

అర్జు—హృదయమున జాలియనునది గలవారందఱు విపన్నుల కట్టిదశలో నభయహస్త మిత్తురు.

యుధి—అందుచేత మాయర్జునుఁ డాతనికి ప్రథమంబున నభయప్రదాన మొనర్చి వాగ్దత్తానంతర మాతని కథావిధానం బరసి యీగయుండు మాధవశత్రువుం డని గ్రహించి చింతించె.

అక్రూ—చింతించిన కార్యమేమి? అతనియాజ్ఞ నెఱవేర్పవలెనుగదా! అర్జునా! నీతో ముఖ్యముగా నీబావ చెప్పుమన్న సందేశము వినుము.

తే. గీ. పాఁతచుట్టాలమని నొక్కి ♦ పలుకుమనియె
నొరులకై పగఁబూనుట ♦ యొప్పదనియెఁ
బడుచుదనపు బింకమ్ములు ♦ విడువుమనియె
తలకు మీఱినపని చేయఁ ♦ దగనిదనియె.

మఱియు,

మ. అవతారంబులు దాల్చినాఁడు పది; బ్ర ♦ హ్మాండంబు నిర్మించినాఁ
డవనీభారము మాన్పినాఁడు ఘనుఁడై ♦ దైత్యశ్రేణి మర్దించినాఁ
డవమానంబును బొందినాఁ డిపుడు మీ ♦ కత్యర్థించియున్నాఁడు పాం
డవులారా! యిదియెల్ల లోఁ దలఁచి యి ♦ ష్టం బెట్లొ వర్తింపరే.

అర్జు—అక్రూరుఁడా! అతని ప్రభావము నేనెఱుంగనివాఁడను గాను. కాని

జన్మించిన యుత్తమక్షత్త్రియవంశము. తాల్చినది దుర్వారమహాప్రతిజ్ఞ. ప్రతిన నెఱ వేర్చుకొనుటలో నాకుగల బంకంబును సాహసంబును దానే యెఱుంగు. ఒకవేళ పౌర్వాపర్యములు విమర్శింపక గయునకు శరణమిచ్చుట నాతప్పైన నవుగాక మించినదానికి నేమి సేయఁగలము? నాకు బరమాప్తుఁడగుటచే నేను లోకనిందపాలు గాకుండునట్లు ననుగ్రహింపవలయును. అతఁడు గయునిఁ గరుణించి క్షమియించి నచో లోకము నాతని యౌదార్యమును గొనియాడు. మఱియు —

మ. కోటి యొసంగిన న్విడువఁ ♦ గూడదు వీనినిఁ జక్రిపాణి నా
ఘోటము చే గయు న్విడిచి ♦ పుచ్చితి మేని జనంబు లెల్ల భీ
రుంటికి ధర్మరాజు చదు ♦ వేటికి భీముని బాహువిక్రమం
బేటికి పార్థు లావనుచు ♦ నెల్లరు నవ్వరె బ్రివ్వదిట్టరే!

భీమ — అక్రూరుఁడా! ప్రతిన నెఱవేర్చుటముఖ్యముగదా! ఆప్రతిజ్ఞాసంపూ ర్తికొఱకుఁగాదె మేమిట్లు వనాంతరంబున నుండుట —

అర్జు — ప్రతిసంపూర్తికొఱకే కాదె పూర్వకాలంబున ధర్మనందననియుక్తుండనై యొకవత్సరంబు సర్వతీర్థాభిగమనంబు చేసితి.

అక్రూ — అమ్మహాత్ముని ప్రతినమాత్రము నెఱవేఱవలదా? దానికేమి? మాశ్రీ కృష్ణునివర్తమానంబునకు నుత్తర మేదో యొసంగుఁడు.

యుధి — ఇచ్చుటకేమున్నది? శ్రీకృష్ణునితో నావలుకులుగా నిట్లు విన్నవింపుము.

సీ. నళినగర్భునిగన్న ♦ నారాయణుఁడు తాను బాంధవుఁడగుట మా ♦ భాగ్యమనుము
బాల్యకాలమునుండి ♦ పాండవులత్తనయాన నెన్నఁడు జవదాటి ♦ యెఱుఁగ రనుము
ఎన్ని సారులు వార ♦ లెంచిన మావాఁడు గావించు తప్పేదో ♦ క్షాంతి యనుము
పరులకై మాతోడ ♦ బంతగించుట యొల్ల దనవంటివానికి ♦ దగని దనుము
ప్రియమున నీవు దనకన్న ♦ బాలుఁడైన సోదరుఁ గేల్పట్టిపలుకుటలు ♦ మిగులిక్కనముము
పాండుపుత్త్రులు విడరాని ♦ బంధులనుము గయుని క్షమియించి పార్థుని ♦ గావుమనుము.

గయు — (తనలో) ఈయుధిష్ఠిరుఁ డంపుచున్న వినయగర్భితసందేశముఁబట్టి దేవకీనందనునకు జడియునట్లు గనఁబడుచున్నది. మీరు నన్నుఁ బ్రోవఁగలరా?

భీమ — అక్రూరుఁడా! కృష్ణునితో నావాక్యములుగా నిట్లనుము. నాఁడు జరాసంధునిచే బంధింపఁబడిన వసుంధరాధరు లందఱు నిన్ను శరణువేడి రనియు శరణాగతరక్షణమువంటి సత్కార్య మొండు లేదనియు చెప్పి నన్ను దోడ్కొని

పోయి యా జరాసంధుని వధియించి రాజుల రక్షించితిమి. నాఁటి వాక్యంబుల జ్ఞప్తిఁ దెచ్చికొని గయుని రక్షింపు మనుము. క్షమియింప నొల్లఁడేని వెండియు నిట్లనుము.

ఉ. శ్రీయు నగు రాజ్యవైభవము ♦ శ్రీయును బంధులు మమ్ము బాసినన్
దయయును సత్యవాగ్రీతియు ♦ ధర్మపథైకవిహారవాంఛ ని
ర్దయశరగమైన క్షాత్రము ని ♦ రంతరము న్మము బాయకున్న న
వ్యయముగఁ గాన వాగ్రహము ♦ నందకు నందకుమార! దీనికిన్.

అక్రూ—మీయిరువుర యభిప్రాయము గయుని విడువకుండుట సూచించుచున్నది. అర్జునా! నీభావమేమి చెప్పుమనియెదవు?

అర్జు—నీయమూల్యవచనంబుల నాలింపుము,

మ. అతిగాఢంబు సుభద్రపైఁ బ్రేమ న ♦ న్యస్తాన్యకామస్థితిన్
మతియుక్తింత సుఖప్రాజ్యరాజ్యపదవి ♦ న్యస్తంబు గావించ నే
యతిగా నుండిన వేళలం బిలిచె నై ♦ య్యంబొందు నన్ సోదరీ
పతిఁగాఁ జేసిన నాఁటిమేటికృప నా ♦ కైంగూపవే శ్రీహరీ.

ప్రాణంబులు నా యధీనము చేసిన విపన్నుని పగతుర కొప్పగించి శరణాగతత్రాణ బిరుదాంక మగు భరతవంశమునకు కళంకము తేఁజాల నని మనవి చేయుము.

నకు—ఆర్యా! నే నిట్లంటి ననుము.

తే. గీ. వగచి శరణుఁ జొచ్చిన వాఁడు ♦ భక్తవరుఁడు
మించి శరణ మిచ్చినవాఁడు ♦ మానమఱది
పరుఁ డేవం డిందులో విను ♦ పద్మనాభ
యాప్తు లేవరించుటనది నేర ♦ మగునె! చెపుము.

సహ—ఆర్యా! సహదేవుఁ డిట్లనియె నని విన్నవింపుము.

ఉ. కాచినవాఁడ వీవ మము ♦ గౌరవు లెగ్గొనరించుచోఁ గృపం
జూచినవాఁడ వీవ మధు ♦ సూదన! నేరము లెన్న నేఁటికి
న్నీచరణారవిందముల ♦ నెమ్మది నమ్మినవార మేగదా!
కాచినఁ గావకున్నఁ దల ♦ కాలము నీయది భాగ్య మచ్యుతా!

అక్రూ—సరే; అందఱ సందేశములఁ దెల్పెద. అట్లయిన గయుని విడువరు గదా! కృష్ణునిమాట తిరస్కరింపఁ దలఁచినారా?

అర్జు—అట్లేల సేయఁ దలఁచినారు?

అక్రూ—మీమాటలయం దంతకన్న నర్థమేమున్నది.

భీమ—అందలి యర్థమేమో స్పష్టముగా నీవే చెప్పుము.

అక్రూ—చెప్పవక్కఱ లేకయే తెలియుచున్నయది. అట్లయిన యుద్ధమునకు సిద్ధమగుదుగా!

భీమ—చేయవలసివచ్చినచో నట్లే చేయుదుము.

యుధి—అంతదూరము రానేల! సామముచేతనే కార్యము సాధింపఁబడుఁగాక.

అక్రూ—దూరము రాలేమి! నీతమ్ములు బలవంతులుగావున గయుని విడువ నంటివి. లేకున్నచో మాధవునకుఁ బ్రతికూలము సేయుదువా!

భీమ—ఇందుఁ బ్రతికూలమేమున్నది!

అక్రూ—అంతయుఁ బ్రతికూలము, సగర్వము.

అర్జు—గర్వమేమియును లేదు.

అక్రూ—అవును. శత్రు సాధించుటమాత్ర మున్నది.

యుధి—మాకదియును లేదు. వినయమే.

అక్రూ—సరియే! నేనట్లు చెప్పెదను. నాకు సెల వొసంగుఁడు. అయ్యా! మధ్యమపాండవా! అన్న పంపున సుభద్ర యూతివయము నీతోడఁ గొంత ప్రసంగింప వచ్చినది. ఆమె తనసందేశము నీకు విన్నవింపుదనుక నేను బహిశ్శాలలో నుండి యవ్వల నాదేవిం దోడ్కొని ద్వారకానగరంబునకుం బోవుదును.

అర్జు—నే నిప్పుడే యామెతో మాటాడెదను.

యుధి—నకుల సహదేవులారా! మీయిరువురు నీతనిని బహిశ్శాలకుఁ దోడ్కొని పోయి సన్మానింపుఁడు.

నకు&సహ—చిత్తము (అని అక్రూరుఁడు నకులుఁడు, సహదేవుఁడు నిష్క్ర మించుచున్నారు.)

గయు—ఆర్యులారా! ఆ నారాయణుఁడు కోపావేశమున మీపై దండువిడియ దారుణసంగ్రామంబున మీరు నన్నెట్లు గాపాడుదురో? నీటముంచినఁ బాలముంచిన భాగము మీయదియే.

యుధి—గయుఁడా! నిశ్చయచిత్తుఁడవై వర్తింపుము. ఆసుభద్రాగ్రజు సోదర నీసుభద్రాకళత్రుఁడు నిన్ను రక్షించు. ఈభీమసేనుఁడు నిన్నుఁ గాచు.

అర్జు—గయుఁడా! పాండుపుత్రులు జీవించియుండునంతకాలము నీవు భయపడనక్కఱలేదు.

యుధి—తమ్ములారా! వాసుదేవుఁ డేమి చేయునని మీరు తలంచెదరు. నిజముగాఁ గయ్యమున కియ్యకొనునా!

భీమ—నిస్సందేహముగా నతఁడు మనతో సంగ్రామంబు చేయవచ్చును.

యుధి—అహాహా! ఎంతవైపరీత్యము! తనకు దగ్గఱ చుట్టములమై ప్రాణసమాన మిత్రులమై తన్నే నమ్ముకొనియున్న మనతో నతఁడు పోర నిచ్చగించునా?

అర్జు—అన్నయ్యా! మీకిది యాశ్చర్యముగా నున్నయదా? రాజులకు నెయ్యములు క్షణభంగురములు. పూర్వబాంధవ్యమును జిరమైత్రిని రాచవారు సరకు గొనరు గదా! చూడుఁడు.

ఉ. పాదపమే యొకప్డు వంశమునఁ ♦ బ్రోదిని గాంచమే యొకప్డు యింటనే
గుడువమె యొక్కపాత్రనను ♦ గొండికనాఁ డొకయొజ్జయొద్దనే
వడయమె విద్యల న్మనము ♦ వారలు నీకరణి న్మఱంగినన్
పాడమగ నేటికయ్య పోర ♦ భుల్లకు న్నగజాతితోడుతన్.

యుధి—(విచారముతో) తమ్ములారా! ఉపకారమునకుఁ బోవ మనకపకార మెదురయినది.

భీమ—అన్నయ్యా! అరణ్యనిర్గమనానంతరమున మీరింత చింతాక్రాంతులుగా నేల? వాసుదేవునితోఁ బగ సాధింపవలసివచ్చెఁగదా యని మీకుఁ జింతగా నున్నదా? ఈమాత్రమునకే మీరింత విహ్వలచిత్తులరైనచో మనయరణ్యవాసాంతంబున, రాబోవు మహాయుద్ధంబున, గాంధారేయ, సింధునాయక, రాధాతనూభవ కుంభసంభవ, శారద్వత, మందాకినీనందన ప్రముఖయోధాగ్రేసరకల్పితానల్పదృఢవ్యూహంబుల నెత్తెఱంగున భేదింపగలరు? పాంచాలరాజతనయాపరాభవదావానలంబు నెత్తెఱంగునఁ జల్లార్పఁగలరు? అదామోదరుండు వచ్చిన సోదరుండు వృకోదరుండు లేఁడే! ఒకవేళ మీరా నారాయణశరాగ్నిజ్వాలలకు భయపడితిరేని యదువృష్ణిభోజకుకురాంధకసైనికగర్వనిర్భేదకముగా గదామాత్రద్వితీయుండనై నే నొక్కఁడ పోవుదు. అర్జునా! సందేహించెదవేమి?

అర్జు—అన్నయ్యా! సందేహమా. అట్టి మందచ్ఛందుఁడను గాను. మహానగరరంగంబున ననంగమర్దను భంగంబు నొందించి తదుత్తమాంగంబు మద్గాండీవప్రహారక్షతంబు గావించినవాఁడనని నీ వెఱుంగవే? ఈయబ్జనేత్రుఁడే గాదు దహనాలనేత్రుఁడు ప్రమథగణపరివేష్టితుఁడై వచ్చిన వచ్చుఁగాక! త్రయస్త్రింశత్కోటినిర్జరగణంబులతో పాకశాసనుండు వచ్చిన వచ్చుఁగాక! ఇందు కేనియు వెఱవను. వెనుదీయను. గయునిఁ గావవలయు నొండె. నేఁజావవలయు నొండె. వేల్పుల మెచ్చవలయు. యశము పొందవలయు. ఆనరహరితోఁ బోరెద. జయము గోరెద.

యుధి—తమ్ములారా! శూరశిఖామణులచే నలంకృతంబగు భరతకులంబున జనియించి నేను వెనుదీయుదునే? ఏకార్యమయినను బ్రారంభించినవెనుక దానియంతంబుఁ

సుఁగొనుట ధీరోదాత్తలక్షణంబు. కావున నేనను రణమునకు సిద్ధముగ నున్నవాఁడను. నా కొక్క రహస్యం బెఱింగించెద వినుండు;

తే. గీ. దివిజు లొక్కొక్కవేళ శో ◆ ధించుచుండ్రి
జనులసత్యనిత్యతఁ గడు ◆ శ్రమము పఱచి
దివిజనాథుండు శిబిని శో ◆ ధింపలేదె!
అల హరిశ్చంద్రు గాధేయుఁ ◆ డరయలేదె!

అందుచే మన సత్యనిత్యత శోధింపఁదలఁచి వాసుదేవుం డింతపట్టు పట్టియున్నవాఁ డేమో యని తోఁచుచున్నది. కాన గయుని విడువవలదు.

భీమ—అన్నయ్యా! మీరు చెన్నగా నాలోచించినారు.

అర్జు—అటులైన నైయుండవచ్చును.

యుధి—తమ్ములారా! మీకింకొక్క పరమార్థ మెఱింగించెద. సావధానులరై వినుండు.

తే. గీ. కమలనాభుని పక్షంబు ◆ గలుగఁబట్టి
మెలఁగుచున్నారు పాండవు ◆ లంతెకాని
సహజముగ వారు దుర్బలుల్ ◆ శౌర్యహీను
లనుచు జగతిలో మన కప ◆ ఖ్యాతిగలదు.

ఇపుడు వాసుదేవునకు ప్రత్యర్థులమై సంగరమందు నిల్చితిమేని మన కాయపఖ్యాతి మానును.

భీమ—ఈమాట నే నీవఱకే చెప్పితిని.

అర్జు—లోకులు నిజము నెఱింగి మాటలాడరు.

గయు—(తనలో) అన్నా! ధర్మరాజు కడుపులో నింతెంత యాలోచన లున్నవో? గడుసుఁదనమున వీని కెవ్వరు సరి రారు.

యుధి—సోదరులారా! ఈగయుని సంరక్షించుటచే లోకమునకు నొక్కనీతి నేర్పఁగలము. లోకంబున బలవంతులును, ధనవంతులుఁ, దుర్బలులను, నిరపరాధులను బాధింపఁజూచుచుందురు. బలవంతులకు జంకియు ధనవంతుల కదురు చెప్పలేకయు లోకులు సాధారణముగా బలహీనుల పక్షమున నుండక బలవంతుని పక్షమునకే చేరుదురు. మన మిప్పుడీగయుని విడిచినచో రాఁగల యుగంబుల జనంబులు బలపరాక్రమసంపన్నులగు పాండునందనులే పూర్వకాలంబున తమమాట నిలుపుకొనలేకపోయిరి. ప్రాకృతనరులము మన మెంతవారమని మనలనే యుదాహరణముగా గ్రహించి సత్యవ్రతమును బరిత్యజించి నీతికి దూరులై చరియింతురు. అన్నమాటకుఁ

బట్టిఁబట్టి మన మీగఁ ధర్మసార్వభౌముని పరిరక్షించినచో మహోపకారియై మిత్రుఁడు, దగ్గఱచుట్టమునగు శ్రీకృష్ణునంతవానిమాటనైనను పాటింపక పాండునందనులు సత్యవాక్పరిపాలనముఁ జేసిరని జనంబులు చెప్పుకొని మనలఁగొనియాడి నీతిమంతులై వర్తింతురు. మన మొకవేళ రణమున శ్రీకృష్ణుని గెలువలేక మృతినొందినను పాండవేయులు ధర్మకార్యార్థమై శరీరత్యాగము చేసిరను సత్కీర్తి జగంబుననిల్చును, మఱియు

క. తనదేహము తనగేహము
తనకాలము తనధనంబు ♦ తనవిద్య జగ
జ్జనములకై వినియోగిం
చిన నరుఁడే నరుఁడు వాఁడె ♦ చెందును దివమున్.

భీమ—అన్నగారి పలుకులు వేదవాక్యములు.

అర్జు—అన్నయ్యా! మీయుపదేశమువలన ధన్యులమైతిమి.

గయు—పాండవేయులారా! లోకంబున మీరే సత్యనిత్యులరు. భగవద్భక్తుల దీవన లగు మీరు చిరంజీవులై వర్ధిల్లుదురు గాక!

యుధి—తమ్ములారా! మనము పర్ణశాలకుఁ బోవుదము రండు.

అర్జు—అన్నయ్యా! సహదేవుఁడు సుభద్రను వెంటఁబెట్టుకొని నాకడకు వచ్చుచున్నాఁడు. మీరు ముందరుగుఁడు, నే నిప్పుడే వచ్చెదను.

యుధి—తమ్ముఁడా! అటులే చేయుము. కాని స్త్రీస్వభావముచేతనో, భ్రాతృస్నేహముచేతనో, యాదవపాండవ వైరముచేతనో యొకవేళ సుభద్ర వ్యత్యస్తముగా మాటలాడినను నీవామెపై నలుగవలదు.

భీమ—అర్జునా! సందేశ మంపుటలో నీవుభీమసేనునితమ్ముఁడవనిపించుకొనుము.

అర్జు—యథోచితముగా వర్తించెద; మీ రరుగుఁడు.

(అవ్వల భీముఁడు, యుధిష్ఠిరుఁడు, గయుఁడు నిష్క్రమించుచున్నారు.)

[అంతట సుభద్రను వెంటఁబెట్టుకొని సహదేవుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

సహ—(తనలో) అర్జునునకుఁ దనకు సంధిచేయుమని శ్రీకృష్ణుఁడే దీని నంపి యుండవచ్చును. కాని.

తే. గీ. ప్రథమమందున నక్రూరు ♦ పలుకు లనెడి
రవకరువలుల నొక్కింత ♦ రవిలియున్న
యీధనంజయు క్రోధాగ్ని ♦ యీమృగాక్షి
మాట లనియెడు సమిధల ♦ మండకున్నె ?

(ప్రకాశముగా) అమ్మా! అన్నగారు నిక్కడ నున్నారు. సమీపింతము రమ్ము.

సుభ—అయ్యా! నారాక ముందుగా మీయన్న గారి కెఱింగింపుము.

అర్జు—(సుభద్రను జూచి తనలో) కటకటా! ఈమెను నేనాసవాలుపట్టుటయే [illegible]శ్చర్యముగా నున్నయది.

మ. అతినిర్వ్యాజపరంపరాకలుషితం ♦ బైయున్న చెన్నొమ్ముతో
 సతతా భర్తృవియోగదుఃఖమునఁ గా ♦ ర్శ్యం బొందు చెమ్మేనితో
 ధృతియెల్లం జెడియున్న నెమ్మనముతో ♦ శ్రీకన్యయుం బోలె యుండ్ఞ
 ద్రితిపద్మాక్షరతారకేశకరే ♦ వణా భామ గన్పట్టెడిన్.

వహ—అన్నయ్యా! సుభద్రాదేవి యిదె మిమ్ము దర్శింపవచ్చినది.

అర్జు—తమ్ముఁడా! చూచుచున్నాఁడను (తనలో) ఈకళ్యాణిని నేఁగనుంగొని [illegible]ంతకాలమైనది. నాఁ డరణ్యవాసదీక్షితుఁడనై యింద్రప్రస్థనగరము విడిచి నప్పుడు [illegible]దా ఈదేవి ముఖమండలంబు కన్నులకఱవుదీఱ నేఁ గాంచుట. ఎంత లెంతలు రాజ [illegible]రాజులు తన్ను మేల్పడి వరియింపవచ్చినవారి నిరాకరించి నన్నుం జేపట్టినందుకు నుతిస [illegible]మేతయై పుట్టినింటఁ బడియుండవలసివచ్చె.

సుభద్ర—ప్రాణేశ్వరా! జయమగుఁ గాక! జయమగుఁ గాక!

అర్జు—దేవీ! నిన్ను జూచుటకు సిగ్గుపడుచున్నాఁడను. ఏమంటివేని

మ అనుగుంజెల్లెలవై ముకుందునకు నా ♦ కర్థాంగమై పాండురా
 జునకుం గోడలవై మహామహిమతో ♦ శుద్ధాంతకాంతాజన
 ౦ బయఁబు న్భజియింపఁ జేజరిలు నీ ♦ కారాటము ల్దప్పలే
 దవగా; నింక ధరిత్రి నెగరిత సా ♦ ఖ్యం ౦ ము నవ్వారిగా.

సుభ—ప్రాణేశ్వరా! దైవదైవకీత్యములకు మీ రేమి చేయగలరు? నావిషయమై [illegible]చింతింపవలదు. ఏలయన,

మ. అనుగుం బిడ్డఁడవై మహేంద్రునకు లో ♦ కారాధ్యుఁడౌ వాసుదేవ
 పునకు న్స్నేహమందినవై సఖుఁడవై ♦ భూవంద్యుఁడౌ ధర్మరా
 జునకు న్దమ్ముఁడవై వాయంగలిచి యా ♦ సుతాత్మునర్థాసనం
 బునధిష్ఠించిన నీవెయిట్లయిన మా ♦ కోర్వెట్లా సుఖం బొందుటల్.

అర్జు—దేవీ! వత్సఁ డభిమన్యుఁడు సుఖియై యున్నవాఁడె?

ఉ. ఎన్నిదినంబు లయ్యెఁ గని ♦ రా యభిమన్యుని గన్నులార నా
 కన్నకుమారుమోము నెల ♦ కాయని వెన్నెలయున్న వోలె నా
 కన్నులనుండి బాష్పములు ♦ గాఱవుగా వెతబిడ్డ కివ్వడే
 నున్న తెఱంగు చే బ్రతికి ♦ యుం ండియుఁ దీఱినవాఁడనే సుమీ!

# తృతీయాంకము.

వృథాయాసంబుగ గంధర్వునకు శరణ మొసంగుటయే కాని చక్రిహస్తాస్త్రంబున నతండు సంహరింపఁబడక పోఁడు. మీరు మిక్కిలి మీదిరస్నేహబంధము విడిపోవుటయే దీనిఫలము.

అర్జు—ఏమి? గయుఁడు సంహరింపఁబడక పోఁడుగా? మీయన్న దశావతార చరిత్రయైనను సరే యతని మొగమాటమున సహజకులాచారధర్మమైన శరణాగతత్రాణ బిరుదంబు గోలుపోదునే? మత్ప్రాణంబునఁ బ్రాణవాయువు లెంతకాలంబుండు నంత కాలము నేనీగయుని విసర్జింపను.

సుభ—విడువనిచో యుద్ధంబునకు రమ్మని యమ్మహాత్ముండు సెలవిచ్చె.

అర్జు—(కోపముతో) యుద్ధమన్న దుండవుగమ్మనినంతనె మహాభీతచేతస్కుండనై గడగడవడంకి గంధర్వుని నీయన్న పాదములపైఁ బడవేయుదు ననుకొంటివి కాఁబోలును? కంతగతప్రాణుం డగువఱకు నీరాజకంఠీరవుం డావరకంఠీరవునితో సంగ్రామం బొనర్చు; భయమునులేదు. దేవీ! ఇంతటి యుపదేశము చేయుటకా యింత దూరముననుండి వచ్చితివి?

సుభ—దేవా! మీకు నేను ధర్మముపదేశించుటకు రాలేదు. దయామయులగు మిమ్ము నే వేడుకొనవచ్చితిని. పలుమాఱులు మీకుపకార మొనర్చిన మేనమఱందితో మీరు కయ్యమున కియ్యకొనినయెడల జగజ్జనములు మిమ్ము విశ్వాసఘాతుకులందు రేమోయని భయపడుచున్నదానను.

* ఆ. వె. అల్పులోకనికరవ ♦ నతిమైత్రిఁగలమీరు
పోరు సేఁకు రేని ♦ పొందువిడిచి
పరనృపాలురెల్ల ♦ పరిహసింపరె మిమ్ము
నేగినానిలేదు ♦ శ్రేయమించు.

అర్జు—అట్లు న్యాయాన్యాయవిచారణములేక లోకులు పలుగాకులై నన్ను విశ్వాసఘాతుకుం డనినచో దమపాపంబులఁ దామే నశియింతురు. అతఁడు మాకమితోపకారంబులు చేసిన నధర్మకార్యంబునకు నన్ను బురికొల్పినపుడు నే నతనియాజ్ఞ మన్నింతునా? నాటివారు నన్నిన నవ్వుదురు గాక; గయుని విడువను.

సుభ—ఈసాటివిషయమున నర్ధాంగనైన నామాటమన్నింపఁగూడదా? మేనమఱందలై యిల్లాలై చిరసహవాసినియైన యూడుదానికింతమాత్రపుఁ జనువు చెల్లదా?

అర్జు—ఈవిషయంబునఁ గాక యన్యవిషయంబుల నీచనువులు చెల్లు.

తే. గీ. అన్నియెడలను నేను మీ ♦ యన్న పోలెఁ జిగురుబోండ్లమాటలెప్పటి ♦ నేయుదునని
తలఁచి వచ్చితి కాఁబోలు ♦ దౌత్యమునకు తెలతలా రాజనీతులు ♦ నేర్పువారు?



శ్రీ

ప్రచండయాదవనాటకము.

అను

# గయోపాఖ్యానము.

## చతుర్థాంకము.

రంగము—ద్వారకానగరము, శ్రీకృష్ణుని యంతఃపురము.

(అప్పుడు నందకుఁడను వృద్ధకంచుకి ప్రవేశించుచున్నాఁడు)

నంద—(తనలో) ఆహాహా! ముసలితనము కడుదరిద్రవస్త్రైనను సౌకుమార్యము కల్పిపెట్టును.

తే. గీ. తరుణవయసున నారోడ ♦ ల్దాచుకొనక
యంతిపురి నాడిగము చేసి ♦ నట్టి నేను
బలము చెడి నేఁడు మాదిమిని ♦ బాలచేతఁ
బతులా చేయించుకొనుచుంటిఁ ♦ బ్రభువుభాతి.

కావునసే దయామయుఁ డగువాసుదేవుఁడు ముసలితనముచేఁ జేవచెడి యున్న నన్నుం జూచి జాలినొంది శ్రమకరము లైనకార్యములయందు నన్ను నియోగింపక యలఁతి పనులఁ జేయుటకయి పనుచుచుండును. యజమానుఁడు జాలికలవాఁడు కానియెడల సేవకులు నరకబాధలను భూలోకమందె యనుభవింతురు. సరే, ఇప్పుడు వాసుదేవుని యానతిచొప్పున సాత్యకిబలరాములను బిలుచుకొని వచ్చెద. (అని కొన్ని యడుగులు నడచి) ఎవరోవచ్చుచున్నారు; అక్రూరునిసందేశ మేమైనదో కనుఁగొనవలయునని నామనస్సు కుతూహలపడుచు నున్నది. ఈవచ్చువాని జాడ తెలియునేమో యరసెదను.

[అప్పుడు కాశికుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

కాశి—(తనలో) "పాండవులకాలికి జనివచ్చిన యక్రూరునిసందేశము సత్వరము వినవలతుఁ గావున వానిఁ దోడ్కొనిరమ్ము" అని వాసుదేవుఁడు నన్నుం బనిచెఁ గాని యక్రూరుని సందేశ మంత వినఁదగినదిగా నున్నట్లు గనపట్టదు. ఆతనిమాట వినిన పిదప యాదవపాండవవైరాగ్నులను ప్రజ్వలింపక మానదు.

నంద — ఆర్యా! ఎవరు నీవు? (అని దగ్గఱకుఁబోయి) నాయనా కాశికుఁడవా?

కాశి — అవును. నీ విప్పు డెచ్చటికిఁ బోవుచున్నావు?

నంద — అక్రూరసందేశము బలరామసాత్యకిసమేతుఁడనై వినఁగోరుచున్నాఁడను. కావున, వారిని బిలుచుకొని రమ్మని వాసుదేవుఁడు నా కానతిచ్చె. ఇప్పుడు వారినిఁ దోడ్కొనివచ్చుటకుఁ బోవుచున్నాఁడను. నీ వెం దరుగుచున్నావు?

కాశి — అక్రూరునిం బిలువుమని వాసుదేవుఁడు నన్నుఁ బనిచె నాతనిం బిలిచి యిప్పుడే నే వచ్చుచున్నాఁడను.

నంద — (రహస్యముగా) ఆర్యా! అక్రూరసందేశ మెట్లు పర్యవసానమైనది?

కాశి — అక్రూరుఁడును సుభద్రయు ద్వైతవనమునుండి నిన్న రేయి ప్రొద్దుపో యివచ్చిరి. ఇంకను దమసందేశముల నారెఱిఁగింపలేదు. కాని వారిరాయబారఫలము నటిరియొకలాగమునవనియొకరింపవలదంతి యున్నది. ఇది నావలన విన్నట్లు నీ వెవ్వరికిఁ జెప్పఁ బోకుము; ఇది పరమరహస్యము.

నంద — సరే. అట్లే చేసెదను.

కాశి — ఇంక మనము మనపనులమీఁద పోదము.

(అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది విష్కంభము.

[అప్పుడంతఃపురమున నొకగదిలోఁ బలరామ సాత్యకి కాశికులతోఁ గృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

బల — తమ్ముఁడా! అక్రూరుఁడింత యాలస్యము చేయుచున్నాఁడేమి?

కృష్ణ — కాశికుఁడా! అక్రూరుఁ డేమి చేయుచున్నాఁడు?

కాశి — అయ్యా! సత్వరమే రమ్మని చెప్పివచ్చితిని. ఈపాటికి బయలుదేఱియుండును.

సాత్య — కాశికుఁడా! అతనిముఖవైఖరిఁబట్టి సందేశార్థముల నేమైనఁ గ్రహింపఁ గలిగితివా?

కాశి — నేను గ్రహింపఁ దలంచితిని గాని నామందమతి గ్రహింపనిచ్చినది కాదు.

సాత్య — అన్నయ్యా! మనసుభద్రయు ద్వైతవనమునుండి వచ్చినదికదా? సందేశార్థము లామెవలన వినలేదా?

కృష్ణ — సుభద్రయు నక్రూరుఁడు నేకకార్యార్థము లగుటఁ జేసి యక్రూరుని వలన తద్వృత్తాంతము వినినఁ జాలును.

బల — తమ్ములారా! పాండునందను లీవిషయమున నెత్తెఱంగున ప్రవర్తించెదరని మీరు తలఁచెదరు?

కృష్ణ—అన్నయ్యా! తలంచుట కేమున్నది? పాండునందనులు మనకుఁ జిర మిత్రులగుటచే మఱియొకలాగున వర్తింపరు. అన్నదమ్ములొకవేళ గయుని విడుచుట కొడంబడకున్నను పార్థుఁడైనను నతోడఁ దనకుఁగల సంబంధబాంధవ్యంబులం బాటించి నాపంచేశమును గారవించు. పార్థుఁడు నాబహిఃప్రాణముగదా!

సాత్య—అన్నయ్యా! అన్నదమ్ము లొప్పకున్న ననఁ నేల? అధర్మనందనుఁడు నీగీచినగీటు దాటు సాహసించునే?

బల—(పరిహాసముగా) తమ్ముఁడా! గోపాలకృష్ణా! భీమసేనుఁడు గదాయుద్ధ మర్మముల నాకడఁ గఱచిన ప్రియశిష్యుఁ డగుటచే మనమాట శిరసావహించు; సహదేవుండు మానసంబున నీమహిమ నెఱింగినవాఁడే. అతఁ డన్యథా యొల్లించు?

కాశి—ఇఁక నకులుఁడు మనకు పరమప్రియుఁడే. ఎందు మనమాటలొప్పకొ ననివా రెవరు?

బల—తమ్ములారా! మీరూహాలపైనూహలఁ జేసి పృథానందనులు మన కనుకూలవర్తనులగుదురని యెంచుచున్నారు. కాని నేనట్లుతలంపను. తాను శౌర్యరాశి యని గర్వించుపార్థుఁడును, ధర్మస్వరూపుఁడనని చెప్పుకొను యుధిష్ఠిరుఁడును, వీరరసావతారుఁడనని విఱ్ఱవీగు వృకోదరుఁడును మనమాట మన్నింతురని నమ్మను. రాజసూయము నాఁటగోలె వారు బలగర్వితులై యున్నవారు.

సాత్య—అక్రూరవచనంబులు వారిపూన్కి నాన్పఁజాలకున్నను సుభద్రపలుకులైన కొంతపనిసేయును.

కృష్ణ—అన్నయ్యా! పాండునందనులు బలగర్వితులనుట యశ్రుతపూర్వము.

తే. గీ. బలముగలవారు ధీయుతు ♦ లైపాండుతనయు
లనుట సత్యమే యగుఁగాని ♦ యనఘ! వారి
బలమునకు శాంతభావంబు ♦ వన్నెపెట్టు
విద్యకు విభూషణం బగు ♦ వినయవృత్తి.

కాశి—వారిశాంతత్వము, వినయము జూడకపోమా. ఈకన్నుల కిరవ్వులు మారములుగావు. అదిగో నక్రూరుఁడు వచ్చుచున్నాఁడు.

కృష్ణ—అతని రాక శుభావహ మగుఁగాక!

[అప్పుడు అక్రూరుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

అక్రూ—(తనలో) తే. గీ. దూతకార్యంబు కెంపుట ♦ దుష్కరంబు
కత్తిపై సాముచేయుట ♦ గాదలంతు
పరుల నలిగెడు నప్రియ ♦ భాషణములు
స్వామికి నివేదనము సేయు ♦ నలవిగావ.

కాళి—అహా! నీవ్యతిరేకము లతిరేకము లగుచున్నవే? నిగ్రహింపకేగోచెదవు?

కృష్ణ—అక్రూరుఁడా! సంధివచనములచే నేం కాలయాపన చేసెదవు! దుర్గయుఁడు కూఁ డొంగకున్న వాఁడు; పార్థుఁడా వాని గనుచునా లేదా?

బల—ఈతని వైఖరి నవలోకింపఁ బాండునందను లతిక్రాంతమర్యాదులై ప్రవర్తించినట్లు తోఁచుచున్నయది.

అక్రూ—దేవా! అవధరింపుఁడు. నేను ద్వైతవనంబునకరిగి పాండురాజకుమారుల సందర్శించి, వారిచే సత్కరింపఁబడితిని; వారు మీకుశల మడిగిరి

కాళి—కుశలప్రశ్నల కేమిలే! ముందుకథ గానీ.

అక్రూ—తదనంతరము వారికి నేను మీసందేశ మెఱిఁగింపనందఱన్ని విధములననిరి.

కృష్ణ—(కోపముతో) ఏమి! అందఱన్ని విధముల ననిరిగా? తరువాత దరువాత?

అక్రూ—శరణాగతుని విడచి భరతకులమునకుఁ గళంకము తేఁజాలనని పార్థుఁడనియెను

కృష్ణ—ఏమీ! అర్జునుఁడే యట్లనుటకు సాహసించెనా? ఆమూఢచిత్తుని చేతఁ గృష్ణుఁ డిప్పుడు నిశ్శేషముగా వంచింపఁబడినాఁడు.

ఉ. అవినయప్రవర్తనము ♦ లాప్రియపూర్వకభాషణంబు లా
కేవల నమ్రభావములు ♦ క్రించుఁ దనం బని యెంచలేకపో!
బావయుఁ బ్రాణమిత్రుఁడును ♦ బార్థుఁడు నా కనుకొంటిగాని వాఁ
డీవిధి భంగపుచ్చునని ♦ యేఁ గలనైనఁ దలంప నెన్నఁడున్.

బల—(కోపముతో) అనుమోద్రోహచేతస్కుండగు పాండవమధ్యముని దుర్గుణంబుల నీవు నేఁడా గ్రహించితివి. కాని నేను మొదటనే యెఱుఁగుదును. ఏతత్కారణమున గారాబు చెల్లెలగు సుభద్రను వాకౌంతేయునకు వివాహముఁ జేయవలదని బహువిధములనుపదేశము చేసినను మదాజ్ఞాతిరస్కార మొనరించి సుభద్ర నర్జునున కొసంగితివి. ఇది నీస్వయంకృతాపరాధమే.

కృష్ణ—ఓరీ! కృతఘ్నుఁడా! మధ్యమపాండవా! ఆత్మలాభపరాయణుఁడవై చిరకాలం బపరిమితమైత్రిఁ జేసి యీయవసరమున మోసపుచ్చితివిగదా? కపటాంతరంగుఁడ వగునీమాయాసముద్రమున మగ్నులమై మేము నిర్హేతుకముగా మోసపోతిమి. ఖాండవదహనాది కాలములఁ జేసిన మహోపకారములనైనఁ దలంచి యీ గయుని విడువ వచ్చునే? ఇంతవాఁడ వని యెన్నఁ డెఱుఁగను!

తే. గీ. ఆత్మలాభపరాయణు ♦ లగుదు నరులు ప్రాణమిత్రులవలెనె కన్ప ♦ ట్టుచుందు
రవసరమందీఁ బొందఱు ♦ నడఁకువుంచు నిజహితుండు లేఁ డవనిలో ♦ నిశ్చయంబు!

సాత్య—నా యభిప్రాయమున మాధవునకు వ్యతిరేకముగా వర్తింపరాదు.

కాశి— అంత కపటముండుటచేతనే వారికి నరణ్యవాసము గల్గెను.

బల— అవగమకృతఘ్నుఁడగు శ్వేతవాహనుం డారీతి వచింప ధర్మతనూభవుం డెట్లు సహియించెను? అదికూడ విందము చెప్పుడు?

కృష్ణ— అధర్మనందనుండు తద్వ్యతిరేక మెట్లు చెప్పును. అతఁడు నామమాత్రమున ధర్మరాజుగాని నిముమున ధర్మరాజు గాఁడు. అయిన, నతఁడేమనెనో చెప్పు?

అక్రూ— అయ్యా! అతనిమాటలు మనమెఱుఁగమా? ఎప్పటియట్లు నీళ్లు నమలుచు పర్యవసానము దేలనిమాటలతో గయుని రక్షించి పార్థుని గావుమని వినయపూర్వకముగాఁ బలికె.

కృష్ణ— ఆకపటవినయములు నాకు బాగుగాఁ దెలియును. అతనితో నేమి? ఓరీ మధ్యమపాండవా! మత్కృతోపకారజనితవిశ్వాసంబునను నీవు గయుని నొసంగనక్కఱలేదు. మనయిరువురకు చిరకాలబాల్యప్రవర్ధమానస్నేహముచేతనైనను నామాటమన్నింపవచ్చునే; భవత్ప్రాణసదృశమిత్రుండ నగు నాకుఁ బరాభవము జరిగిన నీకు మాత్రము కాదా? అట్టిపాటి యభిమానత్రాణంబు నీ కేలలేదు? ఓపాండవులారా! మదీయ ప్రాణసదృశులనుకొని యాంతర్యకపటభావం బెఱుంగలేక మీకొఱకై యాదుర్యోధనాది కౌరవులతో నిష్కారణవైరంబుఁ దెచ్చుకొంటి. అన్నివిధముల మీకతన నష్టమే కల్గెను. ఏమిది!

బల— తమ్ముఁడా! ఏమిది యనవలె? ఏమో నీ వెఱుఁగవా?

చ. ఎవరినిఁ బ్రాణమిత్రు లని • యెంచితివో పిననాఁటగోలె
వెవరికి గూర్పఁగాఁదలఁతు • వెల్లవసుంధరరాజ్య గూర్చి; నీ
వెవరిని ధర్మమూర్తులని • యెప్పుడు మెచ్చుచు నుందు వట్టిపాం
డవు లరా వైరిన మిమ్మపుడు • నాకును నీకును బంధుకోటికిన్.

ఓకౌంతేయులారా! ధార్తరాష్ట్రులు మహోపకార మొనరింపఁ గని యస్మద్విషయ మఱియు దుఃఖమును బొందితిమి. మీకన్న కౌరవులే మంచివారని యెంచవలసివచ్చె.

పార్థ— అన్నలారా! ఆగ్రహింపకుఁడు. అవిశ్వాసఘాతుకు లాత్మకృతదోష ఫలంబనుభవింపకపోరు.

కృష్ణ— అకపటాత్ముల నైకవంతపరాక్రమజృంభితుల మని మహాగర్వంబుగలదు. తద్గర్వంబు సర్వంబు ఖర్వంబుగానోపును; ఆయార్యాత్ముల కాత్మనిర్మూలనకాలంబు సమీపించుటచేతనే యింతదుర్బుద్ధి యుద్భూతమైనది. లేకున్నఁ జిరమిత్రుండనగు నాతోఁ గలహింతురా? ఇట్టినిరపకారచేతస్కుండ నగు నాకే, పగఁదలపెట్టినపుడు ధార్తరాష్ట్రులతో వైరసంపాదన చేయుట నన్నా నాశ్చర్యమేమున్నది? ఓరీ! యర్జునా!

మఱేది వచుకొంటిగాని యింతవాఁడనని యెఱుంగను. ధర్మనందనా! యుష్మద్భక్తి యొందరికివదయా! అబలగర్వితుఁడగువర్జునుం డొకవేళ నజ్ఞానంబున నట్లొనరించినను సకలధర్మాధర్మకోవిదుండవై, మత్ప్రభావవిదుండ వగునీవైనను మందలింపవలదే?

కాశి—తమ్మునిఁ జీవాట్లుపెట్టుటకు నాధర్మనందనునకుమాత్రము మిక్కు వజ్ఞాన మున్నదా?

కృష్ణ—కుటిలాత్ముఁడు గయుని విడిచిపుచ్చునో! విడువకుండు శాత్రవమస్తక ఖండన ప్రవీణంబగు చక్రింబునఁ జచ్చునో, చూతము. పరాక్రమదర్పితుఁడైన నాహవంబున నిల్చుఁగాక; నన్ను గెల్చుఁగాక. అక్రూరుఁడా! నీవిఁక నీపనిమీఁదఁబొమ్ము?

(అక్రూరుఁడు నిష్క్రమించుచున్నాఁడు,)

సాత్య—అన్నయ్యా! అమ్మాయి సుభద్రవచ్చుచున్నది. ఆమెమాటలువిందము.

కృష్ణ—ఆమెయును దద్వ్యతిరేక మేమిచెప్పును? ఎవరుచెప్పిన నంతే.

బల—అయిన నదికూడ విందము రానిమ్ము.

కాశి—అన్నిమాటలును వీరవలకు. ఇక్కడ కొక్కటితీఱినది.

[అప్పుడు విచారముతో సుభద్ర ప్రవేశించుచున్నది]

సుభ—(తనలో) ఈమాధవుం డక్రూరవచనశ్రవణముచేతఁ గాఁబోలును నధికాగ్రహంబు దాల్చినట్లున్నాఁడు. నే నెట్లుపోదును? ఏమనిచెప్పుదును? మాయన్నయ్యను బ్రతిమాలుకొని ప్రాణేశ్వరునితో యుద్ధముకాకుండఁ జేసెద. ఆయన యంతనిష్కారణముగా బలికెను. ఈయన యేమనునో; (అని దగ్గరకు బోవుచున్నది,)

సాత్య—అమ్మాయీ! యిటురమ్ము! ఆపాండవులవార్త లన్నగారికి సవిస్తరముగా విన్నవింపుము. వారేమనిరి. గయునొప్పగించిరా?

కాశి—మనమాట మనకొప్పగించిరి.

కృష్ణ——అమ్మా! నీప్రాణేశ్వరుని వచోగుంభనము లెట్లున్నవో నీనోటనుండియాకర్ణింప కుతూహల మగుచున్నయది చెప్పుము?

సుభ—అన్నయ్యా! ఆపాండవు లందఱు ముఖ్యముగా నీముద్దులమఱఁదియు గయుని విడువనొల్లనివార్త మీకేమని విన్నవింతును. అంతలను—

కృష్ణ—అమ్మాయీ! అతఁడా నాముద్దులమఱఁది! ఎండకన్నెఱుఁగని శుద్ధాంతకాంతను నిన్ను దారుణారణ్యభూములకు దన్నుమనయింటఁ బంపినవిర్వైన విచారింపక యింతసేయునే? అతని గర్వాంధకారంబు మదీయచక్రానలజ్వాలలఁ బ్రధ్వస్తమగుఁగాక! గయుని రక్షించుటగాదు. తనప్రాణముల రక్షించుకొను మనుము.

ఐశ్వర్యంబు దొలంగి యరణ్యవాసము నొనరించునప్పుడే యింతమర్మదంబు బలిసినది. ఇంక భాగ్యదశలో నెట్లుండునో?

బల—ఆమహామూర్ఖుల కేమియు మామకొన్న తిర్లిపాటో! ఫాలలోచను గెల్చిన గర్వంబున మత్తిల్లియున్న వారని తోఁచుచున్నయది. ఈహాలాయుధుండు వారి క్రొవ్వడంపక పోఁడు.

సాత్య—వారునిశ్చయముగా నిందుఁ బొంపోవచ్చిరి.

కాశి—(తనలో) ఇంక వాఁడిను నన్నైనఁ బాదదూరి కాబోఁలును.

సుభ—అన్నయ్యా! శాంతింపుము. నీవాబాల్యము వారియెడ నధికమైత్రి నెఱపుటచే నిర్మూలించుట ధర్మముగాదు. అదియునుగాక మీరిరువురు బదరికాశ్రమతాపసులు గారె; కాన నామనవి యాలించి నీమఱఁదిని రక్షింపుము. పెద్దన్నయ్యా! నీవైనను మాటలాడవేమి?

కృష్ణ—అద్రోహచేతస్కు డవయుమై వానరవం బలుకదుము. లోకభీకర దుర్వార సంగ్రామాంతరంబున శిరచ్ఛేద మొనరించి శిక్షించుటయే గాని రక్షించు టెట్టులిది. ఆపాపాత్ము సంరక్షణం బాచరింపుమని నీవెట్లనుచుంటివి? అయిన నట్టి తేజశ్శాలిని గావ నాతరమా?

తే. గీ. రాజసూయంబుఁ జేసిన • రాజు గాను
చెంటి దైత్యులఁ జంపిన • శెట్టిఁగాను
ఫాలలోచను గెల్చిన • బంటఁగాను
వారిఁ గావంగ నేనెంత • వాఁడ? సబల!

సుభ—(దుఃఖించుచు) అన్నయ్యా! ఎఱుఁగక నీమఱఁది శరణు నొసఁ అద్దానఁ దప్పేమున్నది?

బల—ఆహాహా! అమ్మాయీ! ఏమి యీపలుకులు, అతఁ డెఱుఁగక చేసెనా! సరే! ఎఱింగి నంతావవడెనా!

కృష్ణ—ఎఱుంగక యతఁడు శరణునొసంగెనా! తప్పేలేదాయేమి? ఆహాహా! ఏమినీపక్షపాతబుద్ధి. ఎంతయు రాచాగర్వమున్డైన నీపాలికేశ్వరుఁడే నిరపరాధిగాను మేమే యపరాధులముగాను నీబుద్ధికిఁ దోఁచుచున్నది గాఁబోలును? అవును. తప్పు నీమగనిది గాదు; నాదే.

సీ. నీనాథునకు నేను • మేనమఱఁదినై సూనయుఁబు నొందుట • యొక్కతప్పు
అన్నయానతి దోసి • యామహాత్మునకు నిన్నుద్వాహ మొనరించు • టొక్కతప్పు
చిన్నవాఁటనుగోలెఁ • జెలిమిమై వారికి నుపకారములు సేయు • టొక్కతప్పు
గర్వితమతి వారు • గావించుదౌష్ట్యంబు నోర్పరించుట • యొక్కతప్పు

ఇప్పుడీ శోకము చేయుటయు మిక్కుటమగు తప్పు చేసినను ఉంటచే • గొప్పతప్పు
అన్నికన్నను మాయింట • యున్న దబల! తలఁచివాఁడు నిలుపుట కింపబెట్టగలదా?
కల్యాణీ! ఇందు విన్నవవలసినపనిలేదు. స్త్రీ పుట్టు కల్పితమే గనుక నేగా గనము.

ఉ. వంతిరయొక తలోటుల • బాల్యమునుండి కూడ బుట్టించిన వా
రింతటి భాగ్య మిచ్చినను • నేకృతి యైన జూచినఁ గాని తాలిమిగా
ముంతయుఁ జేసిన మెండ దిక్క • సోదరులందరిగ బంధుకోటియై
గాంతలు పద్యవచ్చిన ము • గడచనిం బడిచక్కి రెంతయున్.

మఱియు.

తే. గీ. సారెచీరలు నగలును • జాలఁగొనుచుఁ
బుట్టినిండ్లు గుల్లలుచేసి • పోయి పతులు
గుదరు మగనిపక్షముఁ జేరి • యెదురుగుడుట
మగనిపైఁగూర్మి యధికంబు • మగువకెపుడు.

సుభ—అన్నయ్యా! ఇవి ములుకులు గాని పలుకులు గావు (అనిఏడ్చుచున్నది.)

కాశి—మాచెల్లెలైనదిగాక ఈసారి యింకచీరకట్టుకొని మాయిల్లు చేరుము దోఁచుకొని యొఁగున పోవలెనని చూచుచుండును.

బల—(నిందాగర్భముగా) అమ్మాయీ! దుఃఖాతిశయము నొందనేల? శంకర విజయకరోత్సవస్తుఁడు, ఖాండవదహనకృతకృత్యుఁడు, ద్రోణాచార్య ప్రియశిష్యుఁడు నైన నీప్రాణనాయకుం డుండగా విచారించనేల? అతనికి మావలన భయము లేదు. మమ్మతఁడే నిర్జించును గాక దుఃఖాతిరేకము నొందకుము.

చ. మగఁడు దరిద్రుఁడైన నప • మార్గవిహారుఁడయి నింద్యుఁడైనఁ దా
మగువ కతండె వేల్పతఁడె • మాన్యుఁడు కుంభాముయొక్క వేళ నే?
మగువకు నెవ్వరైన వలపు • మాసిన లోపులనింద కోడి తా
మగనిని గారవించుఁగద • మంగళసూత్రము మీఁద భక్తిచేన్

అమ్మాయీ! చాలు. ఇంకేమాకుఁ జక్కట్లు చెప్పకపోమ్మ.

కృష్ణ—అమ్మాయీ! వలుమాటలేల?

తే. గీ. సుదతి! రెండు పద్ధతులం దె • ల్పెదను వినుము;
మగఁడు బతికినా నీయన్న • మగ్గవలెను;
అన్న జీవించెనా భర్త • సున్న యనుము;
వెడఁగుమాటలు చాలించి • వేగఁ జనుము

దేవరకుఁ దెలియని యంశములు లేవుగదా? మావంటి యబలలచేఁ జెప్పించుకొనవలసిన దా? గయుఁడు మీ శరణుఁ జొందెనని తెలిసి పార్థుఁడు శరణు గాలేదు. ఎఱుంగక గయుఁడు డగ్గుచేసెను అది యెఱుంగక యర్జునుండు శరణమయ్యెను. దానిని మీ రెఱుంగక యాగ్రహించుచుంటిరి. కావున పార్థునిఁ బ్రోవవలయును.

కృష్ణ—(కోపముతో) ఓ విదర్భరాజపుత్రీ! నీ యధికప్రసంగంబులు చాలింపుము. నీభర్తవగు నాకు మహాపరాధముఁ గావించిన గంధర్వాధముని రక్షింపఁ గంకణముగట్టుకొన్న నీవివ్వమ్మునిపైననుగ్రహము నీకుఁ గల్గినది గాని నాకుఁ గల్గదు. అతనితో యుద్ధసన్నద్ధులము గావలదేమి? ఇది నీ నేరము గాదు. వాఁడు సకలరాజసమక్షంబున నేఁ దలఁగొట్టఁగ సిగ్గుచేఁ జావక యింకను జీవించియున్న యారుక్మిచెల్లెలవుగావా నీవు? మీది మానాభిమానహీనమైన జాతిగదా? అభిమానము మీవంశమున నౌషధార్థమైన దొరకదు.

బల—ఓ వైదర్భీ! పురుషులు యుద్ధము సేయుదురు. సంధియొనర్తురు. ఆగోడవ అంతఃపురకాంత వగు నీకేల?

కౌశి—నాకు భార్యయై యున్నదియును నా మొగిచినగీటు దాఁటక యుండుగ ఉఱుకు మదుగు లొగ్గుదువా?

రుక్మి—దేవా! నన్నుం దిట్టినను ఫాల్గునిఁ గావుము. అదిచాలును.

కృష్ణ—నీయవినయంబునకు నిన్నుఁ దిట్టకమానను. ఫాల్గునితో యుద్ధము మానను. ఇంక నీ వనవులు చాలును. ఇప్పుడు నీయాలోచన నిన్నెవ్వరడిగిరని చెప్పవచ్చితి అదియునుఁ గాక —

శా. నీలేనవ్వులు నీయొయ్యారములు నీ ♦ నేర్పు ల్విలాసంబులున్
కేళీమందిరమందె గాని పగవా ♦ రిం బెండువోఁ గావు సూ
చాలుం జాలునుగట్టిపెట్టు మిఁక నీ ♦ చాతుర్యముల్ కృష్ణునిన్
స్త్రీలోలుండని యెంచఁబోకు మిఁక నీ ♦ చిత్తంబులో సుందరీ!

సాత్య—అమ్మా! అన్నగా రాగ్రహపరవశులై యున్నవారు. ఈసమయంబున శాంతిఁ జేయ మనతరముగాదు.

రుక్మి—(తనలో) ఈయన కతికోపము కల్గినది. పట్టమహాదేవినని యూరకే చెప్పిన వినకుందురా! యనియు గర్వించివచ్చినందుకు నాకవమానము గల్గునట్లు తిరస్కరించుటయే కాక; మావంశమునుఁ గూడ నిందించిరి. మగవారిని నమ్మరాదు. తమయొక్క [illegible] ప్రీతితీఱిన పిదప దాసికంటె హీనముగాఁ జూతురు.

(అని నిష్క్రమించుచున్నయది.)

కౌశి—మహాత్మా! దేవిగారి విన్నపం బిట్లు తిరస్కరించుట దేవరకు భావ్యంబు గాదు. మీరింత కోపింపఁదగదు.

కృష్ణ—బాలికుఁడా! నీబ్రహ్మచర్యపు మర్కటచేష్టలు మానుము.

బాలి—అయ్యా! ఈమర్కటశబ్దము సార్థకమే యెట్లన, నేను మీమిత్రుండను. పూర్వము రామావతారమునందు మీకు మర్కటములే మిత్రులుగా, ఈయవతారమునందు నేను విదూషకుఁడనుగనుక నేను కౌశికగోత్రుఁడ. నాకంగుమఁ డే గాదు.

సాత్య—అన్నయ్యా! మావదినె సత్యభామాదేవి యిటువచ్చుచున్నది

బాలి—గోపాలకృష్ణా! గణనాయకుఁడవగుటచేఁ గాంతాజనంబులకు నీకడఁ జనవులు మెండుగనున్నవని తోఁచుచున్నయది. ఈరుక్మిణీసత్యభామలు నీకుఁగలిదల నేర్పవచ్చుటయే దీనికిఁ దార్కాణము.

(అప్పుడు సత్యభామ ప్రవేశించుచున్నది)

సత్య—(గవలో) పట్టమహాదేవియనఁగా రుక్మిణీ తిరస్కరింపఁబడినదిగదా! నేఁ జెప్పినచో వారు తప్పకవిందురు. (ప్రకాశముగా) ప్రాణేశ్వరా! ఈదినమున నేదియో నూతనముగా నున్నట్లున్నది.

కృష్ణ—పురుషులకు రాజనీతి నుపదేశింపఁ గాంతలు వచ్చుటయే నూతనము.

సత్య—దేవర కాగ్రహము నిక్కముగా వచ్చినట్లున్నది.

కృష్ణ—ఆ! ఆగ్రహ మంతతో వగలునది కాదు.

సత్య—నామీఁది యిందుకు కింగురా?

కృష్ణ—దుర్వినయము నింతట నుపసంహరించిన బాగుండును

సత్య—ప్రాణనాయకా! ఫల్గునితో యుద్ధము మానవలయునని వేడుకొనుచున్నదానను.

కృష్ణ—ఫల్గునితో యుద్ధము మానవలయునుగా! ఫల్గునితో మాని యేవ్యర్థునితోఁ జేయుమనెదవు. నీ యంతఃపురంబున నీవలె గాజులతొడగించుకొని యుండ్రుందునా? భయలజ్జావినయవిహీనవై పలుక నేల? నీకు లజ్జయెక్కడిది పూర్వకాలంబున శమంతకమణిక్యాపహరణాపవాదము మాపై మోపిన సత్రాజిత్తుపుత్రికవుగావా?

సీ. అదితిఁ బారిజాతమును • దూర్తము సర్వసుపర్వకోటి సం
భావనపావనంబయి స • ముంచితకాంచనసత్కిరీటకో
భావిమలంబులై యలరు • భగ్నశిరస్త్రట పద్యుతంబుగా
గావర మొందిన నీయెడమ • కాలను దన్నవె కాంతి దుర్మతిన్.

అట్టినీకు వినయాదిగుణంబు లెట్లు గలుగును?

సత్య—దేవా! నిగ్రహంబుగా నవమానింప నేల? అతండు నిర్దోషి యగుటచే నే నట్లు చెప్పితిని. పురుషులవ్యవహారములో సంబంధము కలుగఁజేసికొనుట నాదియే తప్పు.

యీడుఁగక బాల్యకాలమున ♦ నుండియుఁ బెంచిన యట్టిమాకు మా
రొదఁగల నీకృతజ్ఞతను ♦ నీగతిఁ జూపితి చాలు డింభకా!

దేవ—ఓరీ మూర్ఖుఁడా! తల్లికైన నాయెడ గలభక్తి యిట్లున్నది. ఇంక నీ ముద్దు చెల్లెలినియా నీవిట్టి. మనము పోదమురా. అఖిలబాధలకు నోర్చి పెంచి పెద్దవానిఁ జేయునంతవఱకే తల్లిదండ్రులము గాని తరువాత మాప్రసక్తి యేల? పోదము రా!

కాళి—అడ్డాలనాఁడే బిడ్డలు గాని గడ్డాలనాఁడు బిడ్డలుగారు.

అందఱు—అమ్మా! నమస్కరించుచున్నాము.

దేవ—అర్జునసమేతంబుగా మీపునర్దర్శన మగుఁగాక.

(అని దేవకీదేవి అభిమన్యుఁడు నిష్క్రమించుచున్నారు.)

కృష్ణ—అన్నయ్యా! ఇంక గయసంరక్షణప్రతిజ్ఞాధురంధరు లగు నా పాండునందనులపైదండెత్తిపోయి గయుని శిక్షింపవలయుఁగదా! అగంధకువ్వని వినుతున్న ఫాల్గునితో యుద్ధసన్నద్ధుల మగుట మీకెల్లర కిష్టమేనా!

అందఱు—ఇష్టమే. అందుం దప్పేమున్నది! రాజనీతి కదా!

కాళి—నాకిష్టము లేకపోయినమాత్రమున యుద్ధము తప్పునా!

కృష్ణ—అట్లయిన యాదవ వృష్ణి భోజ కుకురాంధకవంశోత్తములగు శూరాగ్రేసరులం దండనాథులుగా నియమించి తూణీర బాణాసన కరవాల భిండివాల చక్రాదిసాధనముల నాయత్తము గావించి ద్వారకానగరనిర్గమనంబొనర్తము. అగ్రజా! ఈమహాసైన్యమునఁ బ్రద్యుమ్న సాత్యకి ప్రముఖకుమారులనిరతులై యుండఁదగలయువు. పుష్కరమంతిభోజప్రభృతులు మహారథులైయుండ నేఁటికిదియుక్తము. సాంబచారుదేష్ణాదులతిరథశ్రేష్ఠులుగా నుండ జెప్పనేల. ఉద్ధవాక్రూరాదియాదవుల సమరశూరులుగా నుండుటవల్ల చక్కఁబడుప్రమము. కోదుమవబాలురర్ధరథులుగ మెలఁగవలయును. ఈమహాసైన్యవార్ధికి నీవు ప్రధానసేనాధిపతివై యుండి యుద్ధమునునిర్వహింపవలయును. మఱియు నిమహాయోధసంఘటితసైన్యంబుల ... తవఖాంతరస్థిత పాండవాగ్రిమంబునకుఁగొనిగందము.

బల—గోపాలకృష్ణా! అట్లవశ్యము చేయుదము.

సాత్య—అట్లయిన వేగ మరిగెదము రండు.

కృష్ణ—(తనలో) ఆహా! కాలమహిమ.

మ. కలనైనం దలపోయలేదు గద యా ♦ కౌంతేయు వర్గంబుతో
గలహంబే నొనరింపఁగాఁదగిన దు ♦ ష్కాలంబు ప్రాప్తించునం
చలతిం బోవుని యీకృష్ణాగ్ని యనివా ♦ ర్యంబైన కాలంబె మి
క్కిలి యాశ్చర్యకరం బైన మార్పులను గ ♦ ల్గించుఁగదా ధారుణిన్.

(అని అందఱు నిష్క్రమించుచున్నారు.)



శ్రీ

పరిచండయాదవనాటకము.

అను

# గయోపాఖ్యానము.

పంచమాంకము.

రంగము—పరిదేశము; ద్వైతవనము.

(అప్పుడు యుధిష్ఠిరుఁడు, భీముఁడు అర్జునుఁడు ప్రవేశించుచున్నారు)

యుధి—భీమార్జునులారా!

తే. గీ. కమలనాభునితోడుతఁ ♦ గలహ మెల్ల
భీతహృదయుఁడౌ గంధర్వు ♦ విడువ నొల్లఁ
జాస్త్రరీతమౌ ధర్మము నాకుఁ ♦ జూడ సమమె
యొది విడిచి యొది గొనవత్తు ♦ నిప్పుడేను!

ఎట్లయినను ధర్మముకొఱకు యుద్ధమే కర్తవ్యము. మీరు సన్నద్ధులై యుండుఁడు. మఱియు నియాంగ్యములుగల కిరాతులెల్ల మనకు సాయము చేయునట్లుఁ జక్కఁ బలుకుఁడు.

భీమ—అన్నయ్యా! సమవర్తికరపరివర్తితదండంబుభాతిని గదాదండంబు మదీయహస్తంబుననే యున్నది. ఇంక భయమేమి?

అర్జు—అన్నయ్యా! గాండీవంబును ఫాలనేత్రమేదురప్రసాదలబ్ధ మగు పాశుపతాస్త్రమును, కర మలంకరించుచున్నయవి.

యుధి—గయుని రక్షణ మవశ్య మగుఁగాక! ఈ ధనులకు నిరపాయకరముగ నావావంబు సమాప్తి యగుఁగాక!

(అప్పుడు తొందరతో నొకభటుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

భటు—దేవా! ఇంక నెక్కడిజయము! ఇంక నెక్కడిజయము!

అర్జు—ఓరీ! ఏమిరా! చెప్పు చెప్పు!

భటు — మహారాజా! దుర్యోధనుఁడు భీష్మద్రోణాదియోధులతో సైన్యంబులఁ గైకొని కృష్ణునకు సహాయుఁడై కాఁబోలు మనపై వచ్చుచున్నాఁడు.

భీమ — హా! దురాత్మా! పాండవవిద్వేషి! భరతవంశజలధిబడబానల! మాయోపాయసాధకా! యాదవపాండవనిర్హేతుకవైరసమయంబు వీక్షించి శ్రీకృష్ణసహాయుండవై మమ్ము వధియింప వచ్చితివిగా! అన్నయ్యా! ఆమహాపరాధగణుఁ డనేకపర్యాయములు ధైర్యమున మనపై వచ్చుచున్నాఁడు; వాఁడు ఘోషయాత్రకువచ్చి గంధర్వపరిభూతుఁ డగు నప్పుడు వానిని మనము రక్షించితిమి! అప్పుడు మన ముపేక్ష యొనర్చినచో, గంధర్వులామదాంధుని బంధింతురుగదా! అయిన నేమి? ఈమహాహార్తమున సాధూర్తుని సమవర్తిపురమున కంపెద!

మహాస్రగ్ధర. తొలుదొల్తన్ రాజరాజు ♦ న్ధనిమి దురమున ♦ న్దుష్టవర్యాంగరాజా
న్ఘంహీను న్దుస్ససేను ♦ న్ఘనునుతకలిమున్ ♦ శోణితపా శ్చేసియంతన్
లలనారత్నంబుకృష్ణన్ ♦ బలిచినకుపమా ♦ నంబు నే నీఁగి ధాత్రీ
తలము న్నిశ్చించువాఁడ ♦ న్ధరణిప యరివీరాఁ ♦ దన్నమస్వంపువేగన్.

అర్జు — అన్నయ్యా! శాంతింపుఁడు! శాంతింపుఁడు!

యుధి — తమ్ముఁడా! ఊరకుండుము. ఆదుర్యోధను నభిప్రాయ మెఱింగెదను. ఏకార్యమునకు వేగిరము పనికిరాదు. అతఁ డొకవేళ మంచితలంపున వచ్చెనేమో?

భీమ — మంచితలఁపు వానిని దహనము చేసినఁ గానఁబడదు.

యుధి — మఱియు క్షత్రియధర్మంబు మాందుగా యుద్ధమునకు సమ్మతింపను.

భీమ — (కోపముతో) ఆబాల్యవిరోధితపాండవుఁ డగుమూర్ఖుండును, విషభోజనంబు పెట్టిన ఖలుండును, విషోరగంబులఁ గరపించిన పాపాత్ముండును, జలంబుల బోఁటద్రోయించిన దుర్మార్గుండును, ద్రుపదరాజపుత్రీవసనకేశాకర్షణుఁడగు నికృష్టుఁడును, మనలఁ గపటదురోదరపరాజితులఁ గావించిన నీచుండును నగుదుర్యోధనుండు మీకాప్తుఁడు. భవదాజ్ఞాపాశబద్ధుఁడనై యసమర్థుఁడనైతిని గాని లేకున్నచో-

అర్జు — అన్నయ్యా! ఇది కేళిగాదు. ఆకర్ణుఁ జూచి నే నెట్లూరకుండఁ గలనో గదా! రంగత్తుంగతరంగసంగతం బగు తరంగిణిం జొచ్చి పంకజంబుల నిర్మూలనంబు చేయు మాతంగంబట్లు కురుసైన్యంబుఁ జెండాడెదఁ గాని సమయము గాదు.

యుధి — తమ్ములారా! కర్ణదుర్యోధనులపై నాగ్రహింపకుఁడు.

భీమ — సరే! మీయిష్టము (అని ముఖము పెడకఁ ద్రిప్పుచున్నాఁడు.)

[అప్పుడు కర్ణదుర్యోధనులు ప్రవేశించుచున్నారు.]

దుర్యో—అంతటి దృఢతరస్నేహపాశబద్ధు లగు కృష్ణార్జునులకు విరోధము గల్గుట యత్యంతాశ్చర్యమే. అంగరాజా!

తే. గీ పార్థుఁ డలకృష్ణునకు బహిః • ప్రాణ మండ్రు
కృష్ణుఁ డలపార్థు నర్థశ • రీర మండ్రు
వారి కిప్పుడు వైరంబు • వచ్చెననఁగ
నమ్మఁజాలక యున్నది • నామనస్సు.

కర్ణ—రాజా! కృష్ణుఁడు పాండవులతో విరోధించుటకు కారణం బిది. చతుర్ద శాబ్దమునఁ బాండవధార్తరాష్ట్రులకు స్వాంతదారుణసంగ్రామం బగు. కృష్ణుఁడు పాండవమిత్రుఁ డగుటచే నప్పుడు నిత్యత్వంబునఁ జేవలయును; చేరినచో మన కోడును. అందుచే నిప్పటినుండి గూఁ వారితో విరోధసంపాదనము చేసి యానముతుం బున మనతోఁగూడి యాజ్ఞాప్రాణసంగతుఁ ణంబుఁ జేసికొనదలంచెదును.

దుర్యో—శహబాస్; అంగరాజా! లెస్సగా నాలోచించితివి? కాని నాయభి ప్రాయ మెఱుంగుదువా? ఆబాల్యధార్తరాష్ట్రశల్యశాపకారపారావారముగ్నులు గాక పాండవేయులు వర్ధిల్లుటకు శ్రీకృష్ణుఁడు కారణము. అట్టి శ్రీకృష్ణుని పాండవ సహాయులమయి మన మంతా మొందించినచోఁ గౌంతేయుల నొక్కమహాగ్రంబున మడియింపవచ్చును. అతలంపున వచ్చితివిగాని పాండవులపై దయచే నేను గాలేదు. అగికో ధర్మనందనుఁడచ్చట మున్నవాఁడు. వానిదగ్గఱ కరిగెదము.

యుధి—తమ్ములారా! కర్ణదుర్యోధను లిట వచ్చుచున్నారు. ఏమునఁబోఁకుదు!

దుర్యో—అన్నయ్యా! ధర్మనందనా! వందనము వందనము.

భీమ—(తనలో) ఆవంగినప్పాశిగదతో నొక్కటిచఱచిన బాగుండును

కర్ణ—రాజా! జయమగుఁగాక! జయమగుఁగాక!

అర్జు—(తనలో) ఈగాండీవనిర్ముక్తశరమాలచేనాతనిచేతులుఖండించినబాగుండును!

యుధి—దుర్యోధనా! బంధుమిత్రయుతముగ నీకుఁ గశలమేగద?

భీమ—(తనలో) రాఁగక్షేమవిచారకులైన మీరిందుండఁగఁ గొఱతేయేమి.

యుధి—అంగరాజా! నీకభ్యుదయమే?

అర్జు—(తనలో) ఆదుగాత్ముల కభ్యుదయమే నిరంతరము గలుగుచుండును.

దుర్యో—ఆ! బాంధవవర్గసమేతముగ నాకుఁ గుశలమే! మీకు మంగళమా?

కర్ణ—రాజా! నాకు క్షేమమే! మీకు మంగళమా?

యుధి—(దుర్యోధనునితో) ఏమిచెప్పుదును! మాగోడు తెలియును తెల్లన్న.

సీ. సంతానములు మాకు • సంతానములు గాఁగఁ జింతలవి నిరంత • చింతలుగను
సహకారములు మాకు • సహకారములుగ దూరేకు లన్నియును దూ • రేకులుగను
మాకందభూజాలి • మాకంద మగుచుండ ద్విజతతు లిచ్చలు • ద్విజతతులుగ
భూధరావళి యాప్త • భూధరావళిగాఁగ వనములే యుద్యాన • వనములుగను
నాఁడు కల్లఁ బాదమునందు • నోఁగుటాది యాఁకలకు నొక్కరీతిని • కేవలం మృ
గములముగాక కేవల మనుష్యులము గాక బ్రతుకుచున్నారమమ్మ డాంభికస మూలంగు.

భీమ—దుర్యోధనా! యిమ్మహత్కార్యార్థమై సేనాసమేతముగ దరిద్రుల మగు మమ్ములను మాపై దండెత్తి వచ్చితివా? నిర్జనకజాయమానప్రమాదికమున మృత్యుముఖమునకు వచ్చితివా? అంతటి దుర్బుద్ధి నీ కుదయించదు, గాని

దుర్యో—అన్నయ్యా! యిట్టి మహావిపత్సంగమేల? మనమిరువురము భ్రాతృతనూభవుల మగుటచే, మనలో మన మెల్ల కలహించినను నన్యుఁడగు శ్రీకృష్ణుఁడు మీపై వచ్చుటను జూచి యుపేక్షింపఁ దగినవాఁడు గాదని మీ సహాయార్థమై కురుసైన్యంబులతోడను భీష్మాదులతోడను వచ్చితిని.

భీమ—శ్రీకృష్ణుం డన్యుండును నీవు బాంధవుండవునా?

యుధి—తమ్ముఁడా! దుర్యోధనా! చక్కనిపని చేసితివి నీకు బంధుప్రేమ గలదు.

అర్జు—(తనలో) మీరొక్కరే యిట్లనుకొనుచున్నారు.

కర్ణ—ఈ దుర్యోధనున కత్యంతబంధుప్రేమ గలదు. నాఁడు ఘోషయాత్రాసమయమున మీనిం మీరొనర్చిన యుపకారము స్మరణకుఁ దెచ్చికొని మీకు సహాయము చేయఁదలంచి వచ్చె.

అర్జు—కర్ణా! అంగరాజా! ద్రౌపదివసనధమ్మిల్లాకర్షణము చేయునప్పుడును ద్రౌపదీ పరిభవకాలమునను ఘోషయాత్రాసమయమునను మీ బంధుప్రేమ యేమైనది. నేఁడు నేదో దురుద్దేశముగాని మఱియొకటిగాదు

దుర్యో—(తనలో) ఈతఁడు నాయభిప్రాయము నెఱింగెనా యేమి?

[తెరలోఁ గలకలము]

యుధి—అదిగో మహాత్ముఁడగు శ్రీకృష్ణుఁడు సైన్యముతో వచ్చెను!

భీమ—ఔరా! రానిమ్ము! మనము యుద్ధసన్నద్ధుల మై యున్నారముగద!

దుర్యో—గదాదండ మిదిగో కృష్ణు నిట రానిమ్ము!

కర్ణ—నే నాబలరామమధుసూదనులకు తెలుపను రానిందు

అర్జు—(ధర్మరాజుతో) అన్నయ్యా!

ఆ. వె. మూడుకనులవాని ♦ మొగ్గరంబున గెల్చి
వేయికనులవాని ♦ వెరవు మాన్పి
ఖ్యాతిఁ గాంచినట్టి ♦ నీతమ్ముఁ డున్నాఁడా
తమ్మికనులవానిఁ ♦ దాఁక నిపుడు.

[అప్పుడు శ్రీకృష్ణబలరాములు ప్రవేశించుచున్నారు.]

యుధి—తమ్ములారా! వాసుదేవు నెదుర్కొందము రండు. (అని తమ్ములతో లేచి యెదురువచ్చి) యదుకుంజరులకు స్వాగతము

కృష్ణ—కురువృషభునకు మంగళము.

బల—రాజా! యుధిష్ఠిరా! నీకభ్యుదయ మగుఁగాక.

కృష్ణ—ధర్మరాజా! నీపై యుద్ధార్థులై భీష్మద్రోణసమేతముగ కురుసేనలు సయితము వచ్చియున్నవి. ఇంక గయుని విడువరాదా?

యుధి—ఎట్లు విడుతును? ధర్మయుద్ధమని నీ వెఱుఁగవా?

భగ—సమస్తవేదాంతవేద్యుఁడ వగు నీ విది సమగ్రముగ విచారింపుము.

అర్జు—బావా! అది గురుజనసమ్మత కార్యము గాదు.

బల—కానియెడల యుద్ధసన్నద్ధు లవుఁగాక.

గురు— గురువు లగు మీతో యుద్ధ మొనరింపవలసె. క్షమింపుఁడు.

కర్ణ—ఖడ్గము ధరింపనంతవఱకు గురుబంధువిచారము. ఆ వెనుక లేదు.

భీమ—దేవా! అజాతశత్రూ! ఇంక మాకు సమరసన్నాహమున కనుజ్ఞ నిమ్ము?

యుధి—శుభములకు నిర్వాహకము గాఁగ నగుఁగాక!

(అప్పుడు కృష్ణార్జునులు తక్కఁ దక్కినవారందఱు నిష్క్రమించుచున్నారు.)

కృష్ణ—అర్జునా!

తే. గీ. తలఁచవైతి నీకును నాకుఁ ♦ గలుగు చెలిమి
తలఁపవైతి చుట్టరికంపు ♦ ధర్మమైన
ఫాలనేత్రునిఁ గెలిచిన ♦ బంటు వగుటఁ
దలఁచినాఁడవు గాండీవి ♦ దర్ప మొకటె!

అర్జు—అయ్యా!

తే. గీ. దర్పము గలాఁడ నందు నేఁ ♦ దలఁపలేదు,
పూర్వమైత్రిని దలఁచక ♦ పోవలేదు

మానధనుఁడ వగుట; నీకు • మఱఁది వగుటఁ
దలఁచి నాఁడను క్షత్రియ • ధర్మ మెఱిఁగి.

కృష్ణ—అర్జునా! నామేనత్తకుమారుఁడవై నాయనుంగు సహోదరి యగు సుభద్రఁ బెనిమిటి వౌట మఱందివై యాప్తమిత్రుఁడవైన నీకింత దురాచరణంబు కర్తవ్యమే? అఖిలరాజవంశములలో నాకుఁ బరాభవము దెచ్చుట నీకు భావ్యమే.

అర్జు—స్వామీ! యుష్మద్ధృదయగోచరము గానియంశము చతుర్దశభువనములయందును లేదు. నేను నీతోఁ గలహోత్సాహినై యుంటినో, లేక యీయాని కార్యవైరమునకు దుర్భరపిశాచాక్రాంతచేతస్కుఁడ నైతినో, నీవు యెఱుంగుదువు; నే ననేకవిధంబుల నీతో స్పష్టీకరింప నేల?

కృష్ణ—అవును. అనిమిత్తవిరోధములకు నీవు స్వాతంత్ర్యవిచారము నీకుఁ దగిన దింత సాహసమున కేల సమకట్టెదవు? ఆబాల్యప్రవర్ధమానస్నేహుల మగు మన కిద్దరకు నింతపగ గల్గుటకు భువనము లెల్ల నత్యంతాశ్చర్యము నొందుచున్నవి? నీహృదయస్థితాభిప్రాయమును నీలోకవిరుద్ధకార్యములే చెప్పుచున్నవి. శ్రీకృష్ణసాత్యకి బలరామప్రముఖులు, నివాతకవచ కాలకేయాది దానవవీరవిజయుండవగు నీప్రతిభాప్రతాపానలము నందరకుఁ దృణప్రాయమై యున్నవారమే మెంత తేజోవిహీనుల మైనను నీపాపములందులము గాక పోముసుమీ?

అర్జు—దేవా! అనిమిత్తజనితయాదవపాండవవైరానలదందహ్యమాన మగు నాహృదయారవిందము నిష్ఠురాలాపములచే నేల మఱింత బాధించెదవు?

కృష్ణ—అర్జునా! నేబాధించినదేమి? అది యెల్ల నీస్వయంకృతాపరాధమే కాని మఱియొండు కాదు. నాచేతనైనంతవఱకు సుభద్రాకుమారులచే రాయబారమంపి యొప్పుడైన సంధి యొనర్పు మని యడిగినను నీవియ్యకొనక కుద కింత దెచ్చితివి. ఇప్పుడు నేను స్వయముగ బతిమాలుచున్నాను. నెయ్యమువాని కయ్యమున కియ్యకొనఁ జూచుచుంటివి.

అర్జు—నే ననేకవిధముల నీపదారవిందవందన మొనర్చి ప్రార్థించితినని సుభద్రాకుమారులతోఁ జెప్పి పంపించితిని. అయినను నీవు క్షమింపవైతివి.

కృష్ణ—అన్యాయ్యా! క్షమించెడువాఁడను నేనా!

సీ. ధార్తరాష్ట్రులు వృకో • దరు నీను మెయిఁ జంపి విషభోజనంబులు • పెట్టువాఁడు
నెవఁ డొకింతయు లేక • విదురింపుమటంచు వాని సంబులఁ బడఁ ద్రోసి • యలరువాఁడు
వారణావతమందుఁ • జేరిచి మిమ్మెల్లఁ గౌరవుల్ లక్కయిల్ • గాల్చువాఁడు
కొలువులో యువరాజు • గురుజనంబులముందు యువిద గట్టినకోక • లొలుచునాఁ,

రాజసూయార్థమై భృశ ♦ దర్పితబలుజరా
భీమసేనుని చేతఁ జం ♦ పించినాఁడు
మీకు బుట్టంబునైతిని; ♦ గాక నేఁను
బాంధవుఁడ నాదునే నేను ♦ ఫల్గునుండ.

కృష్ణునితోఁ బనితీరదని గావున నతనిని నీవాదని రాకరించుచున్నావు ఏరుదాఁటి తెప్ప గాల్చినట్లయ్యె ఇట్లు కృతఘ్నుఁడ వగుదువని యెన్నఁడెఱుఁగ.

అర్జు—నీ వనేకోపకారములనొనర్చి యాపన్నులగు పాండవులను గాపాడిన మాట నిజము. వానిఁ దలఁచి యిప్పుడు నమ్ము డిప్పిన కార్యమేమి? మేము కృతజ్ఞులమో కృతఘ్నులమో జగమెఱుఁగు. అయినను బ్రస్తుతాంశవిచార మొనర్పవలయు గాని గతజలసేతుబంధన మేల?

కృష్ణ—అందుచేత నో ధనంజయా! నీకు నే నొకహితోపదేశముఁ జేసెదను.

చ. చెలిమి యొనర్చినార మటు ♦ చిన్నతనంబుననుండి పాయవా
జలజదళాక్షులం గలసి ♦ శయ్యల నుండినవాఁడవైననున్
మెలఁగితి మొక్కకంచమును ♦ మేనులు రెండుగ గాని నేఁడు మా
స్థలమునఁ బాండవా! గయుని ♦ దుంచఁగఁ జేతులు రావు నిన్ననిన్.

అర్జు—దేవా! మీరు చేసినది నిజముగ హితోపదేశమే. కాని యల్పజ్ఞానసమేత మనస్కుఁడ నగు నాకు గయుని విడుచుట యధర్మమని తోఁచుచున్నయది.

తే. గీ. మిగుల నుపకారి యైనను ♦ మిత్రుఁడైన
కానిపని సేయుమనఁ జేయఁ ♦ గలఁడె నరుఁడు
యరసి పాలిచ్చి పెంచిన ♦ యమ్మయైన
విసముఁ బెట్టినఁ గుడుచునే ♦ ప్రియసుతుండు!

కావున నీమాట తిరస్కరించితి ననుఁ గ్షమింపుము.

కృష్ణ—అర్జునా! దేహంబు లనిత్యంబులు, మాటయే శాశ్వతంబు. అనేకోపకారము లొనర్చిన నన్నీసమయమందు నిరాకరించితివో జగంబుల జనంబులు నిన్నాచంద్రతారార్కము విశ్వాసఘాతకుఁడని నిందింతురు. విచారించుటకష్టము. కావున గయుని విడువుము.

అర్జు—శా. దేవా! నీవనిన ట్లనిత్యము లగుం ♦ దేహంబు సంసారముల్
జీవంబుల్ క్షణభంగురంబులు ఘన ♦ శ్రీ బుద్బుదప్రాయమౌ
భావంబందిది నే నెఱింగియు గయుం ♦ ద్యజింతు నేనిన్ జనుల్
హా! విశ్వచ్ఛుఁ డధర్మచిత్తుఁ డనరే ♦ యాచంద్రతారార్కమున్.

అర్జు—ఆమాటయం దబద్ధమే మున్నది!

కృష్ణు—అట్టియెడ నాకవశాగ మొనర్చిన దురాచరణుండు నీచేఁగూడ నప కారము చేసినట్లు గాదా? నా కఖిలలోకముల నవమానంబు సంఘటిల్లినయెడల నది నీకు సంప్రాప్తమైనట్లు గాదా? సమస్తవిషయములయందును నేను నీకార్యములు నావిగా భావించుచుండ నీవట్లు చేయవలెనా? నేవధించెదనన్న వానిని నీవు కా పాడఁగ వచ్చునా? మన యుభయుల మాటలు గొన్ని పంచవాస్తునిపాలి కంపవలెను.

అర్జు—నీవానతిచ్చినట్లెల్లను నిజము. కాని, యధర్మమువలన నేను భయము పడుచున్నాఁడను.

కృష్ణు—నీకట్టి భయంబువలదు. నేను నీకునగ్రజేష్ఠుఁడను. గురుజనంబు లాన తిచ్చినవఱకు, కొండికవాఁడు ధర్మ మని యధర్మమని విచారింపక యేపనినైనం జేయఁ దగు. తొల్లి భార్గవరాముఁడు పితృనిదేశంబునఁ దల్లితల గండ్రగొడ్డంట దెగ్గవేసెను. వ్యాఘ్రముని తనయులు మాతృశాసనంబునఁ దండ్రిని జలములఁ బాఱద్రోసిరి. కావున ధర్మసూక్ష్మంబు లెఱిఁగి వర్తింపుము.

అర్జు—దేవా! అధర్మనిరతుల నుదాహరణముగఁ గొననేల!

సీ. ఆనినమాటను దప్ప ♦ దనుచితం బనిరాదె దశరథసుతుఁడు కాల ♦ ధర్మమెంచి
నిత్యసూనృతవచో ♦ నియమముఁ దప్పెగా, మునుపాండవాగ్రజుండు ♦ మాటఁగొలిచి
అడితప్పు దోస ♦ మని గాంగుఁ డొకఁడిఁ బేనికొందలు ♦ చెంది యిచ్చె
సత్యవాక్పాలనా ♦ సక్తి గల్గుటఁగదా సురలయాఁచనము బలి ♦ గోలుపోయె
నంతదూరము పోనేల? ♦ యబ్జనాభ! తనయులెల్లరు నిలుపంగఁ ♦ దలఁచి కాదె
యఖిలసంపదలకుఁ బాసి ♦ యడవులందు తగనియిడుములఁ గుడుచు మాధర్మరాజు.

కృష్ణు—నే నెన్నివిధంబులఁ జెప్పినను మూర్ఖత విడువకున్నావు. మన పూర్వ జన్మవృత్తాంత మెఱిఁగించెద వినుము వినుమా. బదరికావనమందు దుర్గంతనిష్ఠాగరిష్ఠులై నరనారాయణులను ఋషులు తపముచేయుచుందురు. అందు నరాంశమున నీవును, నారాయణాంశమున నేనును, సకల సర్వంసహాభారావతరణార్థంబు పాండవయా దవవంశంబులందుఁ జన్మంబుగ నుదయించితిమి. నావాక్యంబుల యాథార్థ్యము నె ఱుఁగఁ గోరెద వేని చూడుము (అని కనులఁ దుడుచుచున్నాఁడు.)

అర్జు—(పైకిఁ జూచి) మహాత్మా! చూచితిని. ధన్యోస్మి! ధన్యోస్మి!

చారణపారాయణ! సోమకాన్వయదుర్వారగర్వాఖండనమహోజ్జ్వలా! జగత్ప్రశంసా సమయ సప్తమహర్షి సమన్వితకాకాధార! పాహిమాం, పాహిమాం, దేవా! శ్రీకృష్ణ! నీయనుగ్రహమున, మహాయోగీంద్రదుర్లభ మగు శ్రీమన్నారాయణప్రథమావతార దర్శనము గల్గినది. ధన్యాత్ముండ నైతిని.

కృష్ణ—అర్జునా! ఇప్పటికైనను మదీయపరితత్త్వజ్ఞానము గలిగినదా? గయుని విడిచెదవా?

అర్జు—ఓ మధుసూదనా! నీయవతారదర్శనానంతరమున నాకు నమితోత్సాహ మధిక మగుచున్నది. ఎట్లన, నీవు సమస్తభూతాంతర్బహిస్సంగుండవు; అనంతబ్రహ్మాండమండలాధీశుండవు; నిఖిలచరాచరవ్యాపకుండవు; పరాత్పరుండవు; అట్టివానిని

మ. నినుఁ గయ్యంబున నిల్పి కొల్చితినయే ♦ నిం గాంతు లోకత్రయం
బున మాన్యత్వముఁ బొంది జాలనియశం ♦ బు న్గాకయుద్ధంబునన్
నినుఁ నిర్జింపఁగలేక ఖూళితినియే ♦ నిన్నీ గుహాంగంబుఁ న్
బ్రణుతిం గాంచుమెఁ గాంచుఁ గొందుఁ గద పీ ♦ గర్వగ్రహంబోయెఁ గాన్.

కావున గయునే నిశ్చయించుకొంటిని.

కృ—(నవ్వి) ఎన్ని విధంబుల బోధించినను నీతండు మనోవికారము లెందకు న్నవాఁడు. ఇఁక నీతని యొద్దఁ గాఠిన్యము వహించి మాటాడెద. (ప్రకాశముగా) అర్జునా! యెన్ని విధంబులఁ జెప్పవలయునో యన్ని విధంబులఁ జెప్పితిని. కాని నీ మనంబు నిశ్చలము గాకుండెను. ఇఁక నీ నోరెత్తుట కేమున్నది చెప్పుము?

అర్జు—మాధవా! గయుఁడు నిరపరాధుండగుటచే శరణ్యుఁడు.

కృ—(కోపముతో) మూఢుఁడా! అగుఁ డెందు నిరపరాధుఁడా అట్లయినచో లోకంబు నాయందున్నట్లున్నయది. ఇంతగు నాదరణీయుండవని మన్నింపఁగ బలాఢ్యుఁడగు యదుపుంగవులతోఁ గలహించి నా చెలియలు సుభద్రను నీకిచ్చి వివాహముఁ జేసితిని.

అర్జు—(కోపముతో) నీచెలియలిని నాకేల యొసంగితివి? మతియొక్క మహారాజకుమారుని వరింపలేకపోతివా? ఇంతమాత్రపు కన్య దొరకకపోయిన యెడల బ్రహ్మచారినై యుండనే?

కృ—ఓ కృతఘ్నుఁడా! నీ యాప్తబాంధవుఁడవని ధార్తరాష్ట్రులతో నీమూలమున నిర్హేతుకముగ వైరము తెచ్చికొంటిని. ఇంతవాఁడవని నాఁడే యెఱింగినచో నాగయోగతతో నుండియుందునుగదా?

తే. గీ. పేముఁ బడు బాసకము బోసి ♦ పెంచినట్లు
త్రాచుఁబామును బాల్వోసి ♦ గాచినట్లు

చిన్న నాటనుండి యీ చేను ♦ చేయు మేలు
పార్థ! నీదెస నెంతయు ♦ వ్యర్థ మయ్యె॥

అర్జు—వాసుదేవా!

తే. గీ. కదళికాఫల జక్కెర ♦ కలపినట్లు
బూవిదను మంచిపన్నీరు ♦ పోసినట్లు
వినయగర్భిత మైన నా ♦ విన్నపంబు
నిష్ఫలంబయ్యె నీదెస ♦ నీరజాక్ష.

కృ—ఓరోరి! పరాక్రమలవదుర్విదగ్ధ! నీదుర్వినయప్రసంగంబులు చాలును. గర్వాంధుఁడ వగు నీవు బంధు బాంధవుండవు కావు నీముఖదర్శనము పాతకహేతువు; నీకడకుం బొమ్ము.

(అని త్రిప్పుచున్నాఁడు.)

అర్జు—దేవా!

సీ. గజ్జెలందియలును ♦ ఘల్లుఘల్లని మ్రోయ రహిమీఱఁ దాండవం ♦ బాడె నద్ది!
భువనపావనమైన ♦ దివిజనదికిఁ బ్రభవస్థానమై యుఁ ♦ బరగె నద్ది!
స్వారాజ్యమును గొన్న ♦ వైరోచనుని ద్రొక్కి పాతాళభూమికిఁ ♦ బంపె నద్ది!
పతితపావనమాన ♦ గతిలేక పడియున్న శిలను నాతిగా ♦ సలిపె నద్ది!
యాదిఁ ద్రిక్కి నిచ్చెడు వేళ ♦ నబ్ధిరాజు కనకఘటంబు లెత్తి గంగను ♦ గడిగె నద్ది!
యట్టినీపాదపంకజం ♦ బనులచరిత! నాశిరమున నేమున్న ♦ నవని నుండు.

కావున నీచరణారవిందంబులు చేనొత్తెద నో దేవా! యిటు దెమ్ము!

కృ—ఓరీ! మూఢుఁడా! నివాతకవచకాలకేయాదిమహాదానవవీరులను సంగ్రామరంగంబున భంగము నొందించితినని మహోల్లసంబుతోడ నహంకరించితివి. కోపలజ్జాపరాక్రమహీనుండవై పాదమొత్తెద ననుచుంటివి ఇదియా నీపౌరుషంబు!

అర్జు—(కోపముతో) ఏమేమీ కోపపరాక్రమహీనుఁడనుగా? మదీయదుర్వారపరాక్రమాదులు నీకిది చూపెద; ఫాలనేత్రవిజయములగు దారుణాస్త్రంబులు నాచేత నున్నవి. ఇంకను బోయలేదు. మఱియు, శాంకరకరుణాకటాక్షదత్తపాశుపతాస్త్రం బిదిగో!

కృ—ఆ; నీపాశుపతాస్త్రమహాత్మ్యంబును, దారుణాస్త్రపటుత్వంబును, నడుగనేల! అధమాధములై తేజోవిహీనులగు నివాతకవచకాలకేయాదులను గెల్చి

భుజమున దాల్చు నీసహోదరవీరుఁడు బలభద్రుఁడును నాకు వెఱపు గలిగింపఁగలఁడు

కృష్ణ—ఓరీ! నిర్నిమిత్తమహాత్మపరివాదశీల! లోకైకపూజ్యుఁడగు మాయన్న మాటలిచ్చుటఁ దడవ యేల. మీయన్నవలె మాయన్న జూదరి గాఁడు.

అర్జు—ఓయాత్మశ్లాఘాపరాయణ!

క. మాయన్నకు మీయన్నకు
నేయంశమునందు సాటి • యీ లోకమున
మాయన్న ధర్మరాజగు
మీయన్న యధర్మరాజు • మృషగాదు హరీ.

కృష్ణ—అతనిని మాటిమాటికిఁ బ్రశంసింపకుము. తల్లిఘట్టిపయింటివ్రేలను సేవ మాటలయోగ్యుఁడుగాఁడు.

ఆ. వె. పేరు ధర్మరాజు • పెనువేపవిత్తండ్రి
మాట తేనెతేట • మనసు విషము
నేతిబీరకాయ • నీయుధిష్ఠిరశబ్ద
మెఱుక లేనివాని • యెదుట పొగడు

అర్జు—చిరసహవాసము చేసియుఁ గప్ప పద్మసౌరభమును గ్రహింపఁజాలనట్లు చిరపరిచితుఁడవయ్యు నీవు యుధిష్ఠిరగుణములకు సత్సోదరుల సౌజన్యమును గ్రహింపఁజాలవైతివి. వేయేండ్లు శిరఃక్రిందుగఁ దపము చేసినను మీయన్న మాకు సాటిరాఁడు.

కృష్ణ—నిజమా. నిజము. ఏలయన?

సీ. నీచ మచ్చుగను నాకు • రాచపాడి దొరంగి విడియ మిందుక లేక • విచ్చమెత్తఁ
జనినిరర్థంబుగ • సైదోడు లేవురు వెలఁది యొక్కర్తుకే • పెండ్లియాడఁ
గొలువుకూటములందు • గురుజనంబులమ్రోల ముదతిఁ బందెమువెట్టి • జూదమాడ
నిరువెల్ల గోల్పోయి • నిగ్గున దలవంచి కట్టుగుడ్డలతోడఁ • గాన కేగ
నీవు నీయన్నదమ్ములుం • గేస్తుగార! నేస్తురే మమ్ముబోటులుం • నిశ్చయముగ
జలధివలయితధారుణీ • చక్రమందు మీసహోదరులకు సాటి • మీరెనుమ్మ.

అర్జు—అవస్థాభేదము వచ్చినప్పుడు భిక్షాటన మనుచితము గాదు. ఇందుకు నీవే ప్రమాణము.

తే. గీ. అదితకశ్యపులకు గుజ్జు • వడుగుఁబుట్టి
యడుగుకొనలేద నేల మూఁ • డడుగు లీవు

అర్జు—(మూర్ఛ తెలిసి) ఓకృష్ణా! నిలు; నిలు; దీనరక్షణవ్రతంబుఁ దగు నీ యుద్ధమందు శయించియుండ గయుని దెసకు నీవరుగఁ గలవా?

కృ—(తనలో) ఈతఁడు మరల లేచెనని మనమ్మునకు సంతసము గలుగు చున్నను వీని మొండితనము మొదట కొట్టునప్పుడు మరల లేవకుండఁ గొట్టనైతినని విచారింప వలసి వచ్చుచున్నది. (అని ప్రకాశముగా) అర్జునా! నీవుండవు. గయుఁ డుండఁడు.

అర్జు—మాధవా! ఇదిగోఁ గాచికొమ్ము. (అని బాణము విడుచుచున్నాఁడు.)

కృ—(మూర్ఛిల్లుచున్నాఁడు.)

అర్జు—(తెల్లబోయి చూచి) అహాహా! క్షాత్రమెంత నిష్ఠుర మైనది. పాండవులకుం బరమాప్తుఁడగు కృష్ణుని సహితము నాచేతఁ జంపించినది. హా మాధవా! సత్యభామాధవా! పాండునందన క్షేమంకర! హా చతుర్దశభువనగురూ!

చ. భుజగశయాన! హా పరమ ◆ పూరుష! హా! యదువంశచంద్ర! నీ
విజయుఁడ కన్నుఁ దమ్ములను ◆ విచ్చి కృపాగతిఁ జూడవేమి? నీ
భుజముల నొక్కటం బిగిచి ◆ కౌఁగిటఁ జేర్చవదేమి? లేదిధ
ర్మజుఁ గనవేమి? నాయెడఁగల మున్నటి ప్రేమ యేమి? కోపమా?

అల్పపరాక్రముఁడ మేనమఱఁది నగు నాచేత నే చచ్చితివా? అయ్యో! ఎంతటి దుష్కార్యము సంభవించినది. పరిపాలితసంరక్షకుఁడ్వైన బావను జంపితి నని దుష్ఖ్యాతి లోకమున గలుగుఁగాఁబోలు. దైవమా! పాండురాజాన్వయక్షయమునకు యాదవాన్వయవినాశమునకు నీగయుని వృత్తాంతము కారణము గాఁబోలు. హా! అర్జునపక్షపాతీ! నేను మృతి నొందినచో సుభద్రాద్రౌపదు లిరువురే దుఃఖింతురు. సకలవరనారీహృదయరంజక చిత్రస్వభావుఁడవగు నీనిమిత్తము ముజ్జగములు వగచు. అందుచే నేను జగత్త్రయమున కపకారము చేసితిని.

సీ. యదుకిశోరమ! నిన్నుఁ ◆ బాయఁ జేసి దేవకీదేవి కొంతయు నార్తిఁ ◆ దెచ్చినాఁడ
రసికాగ్రగణ్య! నిను ◆ దూల్చి రుక్మిణీసత్యభామల కెగ్గు ◆ సలిపినాఁడ
నిగమాంతవేద్య! నిం ◆ దెగటార్చి తాపసశ్రేష్ఠులకును దప్పుఁ ◆ జేసినాఁడ
వంశపావన! నిన్ను ◆ బడవైచి సకలబాంధవకోటి కృపకేను ◆ దప్పినాఁడ
వాసుదేవ! నీ విటు వేరు ◆ భంగియైన నస్తమించుచునుగద యాద ◆ వాన్వయంబు
అస్తమించుచునుగద పాండ ◆ వాన్వయంబు అస్తమింపని దేది నీ ◆ వస్తమింప?

కృ—ఓ మహాదేవ! గయపార్థుల తప్పులు సైరింపఁదగినవి కావు. అనుగ్రహించి నన్ను విడువుము!

అర్జు—ఓభూతనాథా! ఇందు నాతప్పు లేదు; తప్పంతయుఁ గృష్ణునిదే.

శంక—తప్పు మీ ముగ్గురియందును గలదు.

కృ—అదియెట్లు!

శంక—ఇట్లు,

మ. ధరగలవారిఁ జూడకయొ ♦ తానుమిడుకఁ గయుతప్పు; చూడఁ గ
రణి నొసఁగ్బ్వాని నర ♦ కం గనుకించుట నీదితప్పు; తా
నరయక ముందుగా శరణ ♦ మాతని కిచ్చుట పార్థు తప్పు నో
నగవిజనాథ! యాకృతన ♦ సంధి యొనర్చుట యువ్వనిర్తిన్.

(అప్పుడు గయుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

గయు—(తనలో) అమ్మయ్యా! ఇప్పటికి బ్రతుకవచ్చునని ధైర్యము కలిగినది. అల్లదె మానిజమంగార మగు మహేశ్వరుఁడు సాక్షాత్కరించి యున్నాఁడు. పురల నాతని శరణము వేఁడెదను (ప్రణామము చేయుచుగా) శరణు శరణు మృత్యుంజయా!

శంక—గయుఁడా! భయపడకుము. భగవంతుఁడు నీయెడఁ బ్రసన్నుఁడగుఁగాక! (అని కృష్ణునితో) దేవా! ఈగయుఁడు నీకు ననాథక్తశేఖరలోఁ జేరిన గంధర్వుఁడు. నీవు కావం దగినవాఁడు. ఈయర్జునుండు నీమఱది నీకు గతినీయుఁడు.

కృ—దేవా! నాఁడు నేఁ సాధారణ ప్రతిజ్ఞఁ జేసితిని.

ఉ. ఈసధి సద్దురాత్ము వధియింపక పోవుమనేని దేవకీ
దేవికి పుణ్యమూర్తి వసు ♦ దేవునకుం దనయుండఁ గానిఁకన్
ధీవినుతప్రభావుబల ♦ దేవునకే ననుజుండఁ గానిఁకన్
పావన మైనయట్టి యదు ♦ వంశమునన్ జనియించు లేదిఁకన్.

దీనికిఁ బరిహార మెట్లు!

శంక—నారాయణా! నీవు గయుని వధియింపకున్నను నీమాట లన్నృతములు గావు చూడు,

సీ. దేవకీసుతుఁడవు ♦ గావు నీవరయంగ పురుషోత్తమా! స్వయం ♦ భువవు గాని,
బలభద్రుఁ డెన్నంగ ♦ భవదగ్రజుఁడు కాఁడు వీహాను వగుఫణి ♦ నేత గాని
యాదవుల్గారు వీ ♦ రఖిలేశ నిన్ గొల్వఁ క్షోణిఁ బుట్టినయట్టి ♦ సురలు గాని,
వరమూర్తుఁడవు గావు ♦ ధరణి భారము మాన్పనవతారమును దాల్చు ♦ హరివి గాని,

నతఁడు దేవకైన ♦ నంగీకరించెఁగా
గయుని విడువఁ డయ్యె ♦ ఘనత గాదె.

కంక—అతఁడు నీమఱఁది యగుటచే నిట్టిసుగుణసంపన్నుఁ డయ్యె.

కృష్ణ—నీభక్తుఁడగుటచే నట్లయ్యెనని తలంచెద.

గయు—ఓహరిహరులారా! నిష్ఠీవనము చేసినందుకు నిందట నేదుఃఖించినను చేయుటయే మంచిదని యిప్పుడు తలంచుచుంటిని. ఏలయన;

మ. తపముల్ నోములు తీర్థయాత్రలు మహా ♦ దానంబులున్ హోమముల్
జపముల్ యాగశతంబు పావననదీ ♦ స్నానంబు లెవ్వారి స
త్కృపకుం బాత్రము గాటప న్నరుఁడు భ ♦ క్తింజేయ నాదేవతా
ధిపులం గంటి నుమారమాపతుల నా ♦ దిష్టంబు సామాన్యమే?

అర్జు—గయుఁడా! నీవు మాకు మహోపకారివని నేనును ధర్మరాజాదులుఁ దలంచవలసి యున్నది.

[అప్పుడు యుధిష్ఠిరుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

యుధి—(గయుని) ఏమిటి? కృష్ణార్జునులతోఁ బ్రసంగించు నాదృష్టమూర్తి రూపనిది! భగవానుఁడు చంద్రమౌళి సాక్షాత్కరించెనాయేమి? అవు నదిగో నీలలోహితుఁడే,

సీ. ఫాలనేత్రముతోడ ♦ ఫణిభూషణముతోడ కాలకూటాంకిత ♦ గళముతోడ
బాలచంద్రునితోడ ♦ శూలహస్తముతోడ మందాకినీలస ♦ న్మౌళితోడ
ధవళదేహముతోడ ♦ భవవిభూతులతోడ ప్రకటవ్యాఘ్రకృమా ♦ లికతోడ
ఘనకపర్దంబులతోడఁ ♦ బలికలాపముతోడ మునికోటి నలరించు ♦ మూర్తితోడ
కరుణ వెదజల్లుకాంత దృ ♦ గ్రాముతోడ భువనజాతార్తిఁ దొలగించు ♦ బుద్ధితోడ
తొల్లిపార్థునిఁ గృప గన్న ♦ భిల్లుఁడహహా! కనుల పండువుగాఁగ సా ♦ క్షాత్కరించె.

[అని ప్రకాశముగా శివుని కభిముఖుఁడై చేతులు జోడించి]

శ్లో. రజతభూధరకూటనివాసినం
కనకభూమిధరేంద్రధనుర్ధరం
నిటలభస్మవిభూతివిరాజితం
సతతమాదిమభిక్షుముపాస్మహే.

(అని నమస్కరించును.)

